పశువైద్య గ్రంథమాల 11 వ పుష్పము

# పశుగ్రాసము.

గ్రంథకర్త:

"అభినవ సహదేవ" ఆయుర్వేద పశువైద్యాచార్య, వైద్యకళా
విభూషణ, పశువైద్యగ్రంథమాల, ఆయుర్వేద పశుచికిత్సా
లయ సంస్థాపకులు, ఆంధ్ర జాతీయ పశువైద్య విద్యాపీఠ
ప్రెసిడెంటు, ఆంధ్ర జాతీయ పశువైద్య
కళాశాలప్రిన్సిపాల్ నగు,

డాక్టర్ యేజెళ్ల శ్రీరాములు చౌదరి,

A. V. L. M. & S., A. M. B. & B.S.

అంగలూరు, కృష్ణాజిల్లా.



1937

 [వెల రు 0-12-0.



గ్రంథకర్త:

"అభినవసహదేవ"

యేపళ్ల శ్రీరాములుచౌదరి

శ్రీ

# విజ్ఞప్తి

నేను సుమారు పదిసంవత్సరములకి్రిందట ఆయుర్వేద పశుచికిత్సాలయమును ఆయుర్వేద పశువైద్య గ్రంథమాలను స్థాపించి అనుభవపూర్వకముగా నపుడపుడు పశువైద్య గ్రంథ ముల బ్రికటించుచు వార్తాపత్రికలలో వ్యాసములువ్రాయుచు నా శక్తికొలది పశుసేవ చేయుచున్నసంగతి తామెల్లరకును దెలిసియేయున్నది. నేను వ్రాసిన గ్రంథములనుబట్టియు, నా యొద్ద తరిబియతయిన వైద్యులద్వారాను, కరపత్రిముల మూలకముగను ఆంధ్రిదేశమందంతటను ఆయుర్వేద పశువైద్య మును వ్యాపింపజేసితిని.

మరియొక ముఖ్యవిషయమేమన నేనిపుడొక ఆంధ్రి జాతీయ పశువైద్య కళాశాలను స్థాపించి గవర్నమెంటువారిచే రిజష్టరు చేయించి యనేకమంది పశువైద్యులను తరిబియతు చేయుచున్నాడను. ఈకళాశాల ప్రిభుత్వమువారివలన ద్వరలో రికగ్నైజు కానున్నది.

ప్రిస్తుత కాలపరిస్థితులనుబట్టి రైతులకును విద్యార్థుల కును తదితరులకును అర్థమగునటుల సులభశైలియందు ఇరువది పశువైద్య గ్రింథములను మాపశువైద్య గ్రింథమాలతరపున బ్రికటించితిని. మా యాయుర్వేద పశువైద్య గ్రింథమాల యందు వెల్వడిన గ్రింథరాజములం దిదియు నొక్కటి. ఇయ్యది

పశుధనాభిమానులగు హైందవులకెల్లరకును హస్తభూషణమని చెప్పనగును.

మా యీగ్రంథములపై గవర్నమెంటు వెటరినరీ, అగ్రికల్చరల్, రెవిన్యూ, ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటులయందలి ప్రముఖులగు నుద్యోగులును తదితర డిపార్టుమెంటులవారును జమీందారులు భూస్వాములు మున్నగు వారు పెక్కురు పెక్కు సదభిప్రాయముల నొసంగియున్నారలు.

మా యీ గ్రంథముల నాంధ్రలోకమాదరించి ప్రతి పాఠశాలయందును, ప్రతిపుస్తక భాండాగారమందును, కోఆపరేటివు సొసైటీలయందును ఉంచి మాపశువైద్య గ్రంథమాల నభివృద్ధికి దెత్తురని విశ్వసించుచున్నారము.

ఈ గ్రంథమునకు దయతో పీఠిక వ్రాసి వన్నెదెచ్చిన పశుధనాభిమాన శిరోమణికిని ముద్దులొలుకునటు లీ గ్రంథమును త్వరలో ముద్రింపించి యిచ్చిన గ్రంథాలయప్రెస్సు మానేజరు శ్రీ కుందా లక్ష్మీనరసయ్యగారికిని, నా యీ గ్రంథ రచనమునకు సాయపడిన గ్రంథముల రచయితలకును నా హృదయపూర్వక వందనము లర్పించుచున్నాడను.

ఇట్లు,

గ్రంథకర్త.

---

# పశుగ్రాసము

పచ్చనిగడ్డిభూములలో దిరుగుచు, జలాశయమునందలి నిర్మలోదకము (Pure water) ను త్రాగుచు, చల్లని తరుచ్ఛాయలక్రింద నిద్రించుచు, గోపాలబాలుని సన్నని పిల్లనిగ్రోవి పాటలకు తోకలు నిగిడించి, మోరలుసారించి, వీనులు దోరించి రంకెలువేయుచు బరుగులిడుచుండు ఆ గోగణము (Cow herd) ప్రతిహిందువుని హృదయఫలకమునందు ముద్రితమైయున్నది. భుజములపై దండమునిడి పాటలుపాడుచు పశువుల మందలను తోలుకొని సాయంతనములందు గోపాలబాలురు పొలముల నుండి నివాసములకరుగు దర్శనము ప్రతిగ్రామము (Every Village) న ఆనందము గొల్పుచుండును. భారతలక్ష్మికి ఆలవాల మనదగిన నీపశుగణమునకు సరియైన గ్రాసము దొరకుటలేదని తెలిసికొనిన ఏ భారతీయుని హృదయము జలదరింపకుండును. పూర్వమున ప్రసిద్ధిజెందియుండిన గ్రామము లనేకములు ఇపుడు పాడునడిన గ్రామములు (Ruined Villages) గను పరిణమించుచున్నవి. ఈ కారణముచేతనే వ్యవసాయము చేయువారల సంఖ్య తగ్గుచున్నది. గ్రామములలోనున్న రైతులకు ఐకమత్యమూ లేదు. పశుసంతతి నుద్ధరించుటయూ నున్న. పల్లెలు పేరులేకుండ పాడగుట కుపక్రమించుటచే పశువులకు మేత చిక్కకపోవు కారణముచేత ననేకులు వానిని కసాయివారలకు విక్రయించుచున్నారు. ఈ కారణముచేత తినుట కాహారపదార్థములు తక్కువగా నున్నవి. దొరికినను

వాటివెలలు పూర్వముకంటె మితిమీరియున్నవి. పాలు, పెరుగు, వెన్న మున్నగువానిని గురించి చెప్ప పనియే లేదు. బీదవారలు జీవించుటే కష్టముగా నున్నది.

పూర్వము ప్రతిపల్లెయందును సంపూర్ణ స్వరాజ్యముగా నుండెడిది. నియమము ఆచరణలో నుండుటచే పల్లెలకు కావలసిన సకలసౌకర్యములు వారలుండు స్థలమునందే దొరకుచుండెడివి. ఏవిధమున కొరతయుండెడిదికాదు. సంపూర్ణతృప్తి ఎల్లరయొద్దను నిలిచియుండెడిది. భూమాత గోమాత సహాయము లేనిది మానవులు జీవించుటే కష్టము. భూమిని సకాలములో దున్ని విత్తిన, సకాలములో పంటయు హస్తగతము కాగలదు. ఈ కార్యమును జరిపించుటకు ఐకమత్యముచేత పనిచేయవలసి వచ్చుచున్నది. చూడుడు ! మనయింటియందు కూర్చుండి సుఖముగ ఒక ముద్దయన్నమును దినుటకు ఎంత కష్టపడవలసియున్నదో! దున్నెడి నాగలి మొదలగునవి చేయుటకు వడ్రింగులు కమ్మరులు కావలెను. దున్నుటకు ఎద్దులు కావలెను. ఎద్దులకు ఆహారము కావలెను. భూమికి ఎరువు కావలెను. ఎరువును నింపుటకు బండ్లు కావలెను. బండ్లు చేయుటకు వడ్రింగిరీతిగా కమ్మరులు కావలెను. ఇటువంటిపనులు చేయుటకు సంఘీభావము కావలెను. ఇప్పటి పరిస్థితులలో సంఘీభావములేక గ్రామములలోని పశుసంతతి నాశనమగుచున్నది. ఇంతియేగాక దేశమున యంత్రములు హెచ్చినవి. చేతిపనులు మూలబడినవి. ఎల్లరు యంత్రముల నుండియే తయారుచేయబడిన తవుడు పొట్టుధాన్యములు పశువులకు

మేపుచున్నారు ఇట్లు మేపుటవలన పశువులు నానావిధ రోగముల (Various kinds of diseases) పాలై క్షీణించుచున్నవి. కాబట్టి పశువుల ఆహారవిషయములలో రైతులు (Farmers) తగు శ్రద్ధ తీసికొందురుగాక.

## పశుసంపద

మన దేశములో వ్యవసాయమంతయు పశుసంపత్తి పైననే ఆధారపడి యున్నది. ఇప్పటి దినములలో యంత్రములు మొదలగునవి వచ్చినప్పటికి పశువుల సహాయము లేకుండ వ్యవసాయముచేయుట అనునది ఇప్పటివరకు అసంభవమగు విషయముగనే యున్నది. యంత్రములు మొదలగు సాధనసామగ్రిలు బయలుదేరినను మన దేశములో నవి సాధారణముగా అందుబాటులోలేవు, సరిగదా వారు ఉపయోగించుటకు వీలుకూడ లేదు. కనుక ప్రజలజీవితములకుకూడ పశువులు చాలఅవుసరమై యున్నవి. పశువులకును, మనుష్యులకును అవినాభావసంబంధమున్నదనికూడ చెప్పవచ్చును. ఇటీవల కొందరు రసాయన శాస్త్రజ్ఞులు (Chemists) పశువులకు బదులు యంత్రములను, పాలు, నెయ్యి మొదలగువానికి బదులు వృక్షములనుండియు, పచ్చిగడ్డినుండియు వెన్న మొదలగు వానిని తయారుచేయుటకు ప్రయత్నించి కొంతవరకు సఫలప్రయత్నులైరి. కాని కృత్రిమముగా తయారుచేయబడిన ఈపదార్థములు సాధారణ రైతులకు అందుబాటులోలేవు. ఇట్లున్నను ఆపదార్థములలో పాలు, నేయి యున్నటుల శరీరపోషకములగుగుణము

లును లేవు. అవి మనుష్యుల కెంతవరకు నుపయోగించునో యను విషయమింకను సందేహాముగనున్నది.

పశువులను వ్యవసాయమునుండి తొలగించుటకు ఎవ రెన్ని ప్రయత్నము లొనరించినను దేశముయొక్క ప్రస్తుత పరిస్థితులలో అవియన్నియు నిష్ఫలమగుట తప్పదు. ఇటువంటి పశుసంపదను పోషించి కాపాడి అభివృద్ధి చేసికొను పద్ధతులను గురించి పురాణములలోను, శాస్త్రములలోను, చాలవిషయ ములు తెలుపబడెను. భారతీయులు ఈపశుగణమునకు ఎంత ప్రాముఖ్యమునిచ్చినారనిన వానిని దేవతాసమానములుగ జూచి పూజించువారు. కాబట్టి మానవజీవితము(Life of a man)నకు ఇంతప్రధానమగు పశువుల యభివృద్ధి విషయమున ఎక్కువ శ్రద్ధవహించి లాభమునొందెదరని నమ్ముచున్నాను. ఇటీవల కొన్ని సంవత్సరములు ఈదేశములో పశుసంతతి అన్నివిధముల చాలక్షీణించిపోయె ననువిషయము ఎవ్వరును కాదనజాలరు. పశువుల నెక్కువశ్రద్ధతో పోషించుకొను కొన్ని ప్రదేశములలో తప్ప పశువులు చాల దుర్బలములై క్షీణించియున్నవి. వేసవి కాలములో పశువుల కడుపులను సగము మాడ్చియుంచుదురు. మిగిలిన దినములలో నైనను వానికి పెట్టు ఆహారము చాల తక్కువ. ఈ దేశములో పశువులు తమజీవితకాలమంతయు తిను టకు తగినంత ఆహారములేక కడుపుతోనే గడుపుచున్నవని చెప్పుటలో అతిశయోక్తి లేదు. అందువలననే పశువులు ఇదివరకు కంటె చాలచిన్నవిగను, దుర్బలములుగను, కృశించునవిగను నగు చున్నవి. ఈపశువులు పూర్వపు పశువులంతపని జేయజాల

కున్నవి. వీనిసంఖ్యకూడ దేశములోనున్న ఆహార సౌకర్యము లను బట్టిచూచినయెడల చాలహెచ్చుగనే యున్నది. ఈ పరిస్థితుల ఫలితముగ పశువు లెక్కువగా ప్రతిసంవత్సరము చనిపోవుచుండుట,ఉన్నవైననుబలహీనత(Weakness)చేపూర్తిగా పని చేయజాలకపోవుట సంభవించుచున్నది. ఉన్నపశువు లను బాగుగా మేపుకొనినయెడల ప్రస్తుతమున్న పశువులలో సగముసంఖ్య వ్యవసాయకులకు చాలును. ఏదో కొంచెమెరువు వచ్చుననుమాట పొరబాటు. ఇట్టిదుర్బలములగు పశువులవలన ఎట్టి ప్రయోజనములేదు.చచ్చినపిదప వానితోలుకైనను మంచి ఖరీదు వచ్చునాయని చూచిన వచ్చేధరకూడ తక్కువ. ఇకఆవు పాలు చూచెదమనిన సగటున దినమునకు ఒకటి లేక రెండు న్నర సేర్లకంటె ఎక్కువ పాలీయవు. మన పశువులు ఇట్టిస్థితిలో నుండుటకు కారణము వానికి సరియైన ఆహారము లేకపోవడమే! తగినంత మేతయుండిన ఆవులు యిచ్చుపాలు, ఎద్దులు చేయుపని కూడ చాలహెచ్చును.

ఎక్కువ పశువులు గల ప్రతివారును తమమందలను వర్షాకాలము, వేసవికాలము అనుభేదములు లేక బీళ్లలోనే మేపుదురు. ఆపశువులమేతకు మరియొక యేర్పాటుగాని సదుపాయముగాని యుండదు. రాత్రివేళల వానినికట్టుటకు పాకలు కూడ సామాన్యముగా నుండవు. ఈ పశువుల స్థితి ఋతువులను బట్టికూడ మారుచుండును. వేసవికాలములో సగము ఆకలితో తనజీవితమును గడపుచుండును. వర్షాకాలములో అంతకంటె కొంచెము తక్కువ ఆకలితో జీవించుచుండును. వేసవికాల

ములో పచ్చికయుండదు. కనుక నిలువజేసియుంచబడిన ఎండు గడ్డి మీదనే ఆధారపడియుండవలయును. వరిగడ్డిలో పుష్టికరమగు పదార్థము అసలే తక్కువ. వరిగడ్డియైనను కడుపునిండా యుండదు. ఇంకను పశువుల మేతకు వదలివేయబడు భూములు సాధారణముగ నిస్సారమై ఎందుకు పనికిరానివిగ నుండును. పశువుల మేత యెంతమాత్రము నందు గనుపింపక ఎడారి (Desert)వలె నుండును. పశువులు ఆ ఎడారియందు దూరక తిరిగి తిరిగి ఆకలితో మరలివచ్చును. పశువులశాలలో కట్టి మేపు పద్ధతి ఎక్కడను కనుపింపదనియే చెప్పవచ్చును. అట్టి పద్ధతి యున్నను పనిచేయుపశువులను, పాలిచ్చుపశువులను మేపుదురు గాని ఇతరపశువుల సంగతి తలపెట్టరు. పనిచేయువానికి తప్ప తదితరపశువులకు దాణాకూడపెట్టరు. రైతులయొక్క పాడి పంటల యభివృద్ధియంతయు పశువుపై నాధారపడియున్నదను విషయము మన ప్రజలింకను గ్రహించినటులలేదు. వ్యవసాయమునకు వెరచి మానుకొనవలసినవా రగుచున్నారు.

## విదేశములలోని పచ్చికబయళ్లు - పశుపోషణ.

ఉష్ణ మండలములోను సమశీతోష్ణమండలములోను పచ్చికబయళ్లు గలవు. ఈబయళ్లలో వానఎక్కువగాకురవదు. కనుక చెట్లు మొలవవు. నదీతీరమున మాత్రము చెట్లు మొలచును. ఎండకాలమున పచ్చిక ఎండిపోవును. ఉష్ణమండలపు పచ్చిక బయళ్ళను సావన్నాస్ (Savannas) అందురు. సమశీతోష్ణమండలపు పచ్చికబయళ్లలో సంవత్సరము పొడుగునను పచ్చిక పెరుగుచుండును. ఇచ్చట ఎండకాలమున ఎండఎక్కువ.

వర్ష మెక్కువగ లేకపోయినను పచ్చికకు కావలసినంత కురియును. ఈపచ్చికబయళ్లకు పాంపాస్, స్టెప్స్, ప్రియరీస్ అని పేర్లు. ఇట్టిప్రదేశములు సాధారణముగా సముద్రమునకు దూరమున నుండుటచే ఎండకాలమునందు ఎండయు, వానకాలమందు వానయు ఎక్కువగానుండును. ఇటువంటి పచ్చికబయళ్లు అన్ని ఖండములలోను గలవు. వేలకొలది పశువులను గొఱ్ఱెలను మేపుకొని ఇచ్చట జనులు నివసించుచుందురు. ఉష్ణమండలములలోను, దానికి సమీపముననుండు సమశీతోష్ణప్రదేశములలోను అరటి, మామిడి, ఈత, పేరీత, టెంకాయ మున్నగునవియును చక్కగా ఫలించును. టెంకాయలు మనదేశములోను, సీలోన్ (Ceylon) లోను, సుమిత్రా జావా మున్నగు ఉష్ణ ప్రదేశములలోను చక్కగా ఫలించును.

ఆయాప్రదేశములలో చెట్లచేమలలో భేదమున్నట్లు ఆయాప్రదేశములలో జంతుజాలములలోను భేదమున్నది. దట్టమైనఅడవులలో జంతువులు విశేషించియుండును ఇచ్చట వీనికి వలయు ఆహారములు మెండుగనుండుటయే ఇందులకు కారణములు. ఎడారి ప్రదేశములలో మృగములు ఉండవు. శీతలమండలములలో జంతువులుకొన్నియే యుండును. శీతోష్ణస్థితులలోని భేదముల ననుసరించియే జంతువులుండును. ఆఫ్రికా ఉష్ణమండలము (Tropical region ) లోని దట్టమైన అడవులలో పులి, సింహము, జిరాఫి, జీబ్రా మొదలగు నానావిధ మృగములును చెట్లపై నివసించు కోతులు మున్నగునవియు, పాములు పక్షులు మున్నగునవియు విశేషించియుండును. ఈప్రదేశ

ములలోని నదులలో మొసళ్లు, ఖడ్గమృగములు, నీటిగుఱ్ఱములు, మున్నగునవి నివసించును. ఆఫ్రికాలోని పక్షిజాతులలో నిప్పుకోడి(Ostrich) పెద్దది. ఆస్ట్రేలియాలోని జంతువులు ఇతర దేశములలోని జంతువులకన్న వింతయైనవి. శీతల దేశములకు సమీపమునసుండు ప్రదేశములలో జంతువులు తక్కువ. వీనికి చలిబాధ లేకుండుటకై వీనిచర్మముపైన ఉన్ని (బొచ్చు) ఎక్కువగానుండును. బొచ్చుకై ఈజంతువులను వేటాడుదురు. రెయిన్‌డియర్ అనుజంతువు మంచుగడ్డలమీదను దిబ్బలపైనను సులభముగా త్వరగా నడువగలదు. అక్కడ దొరకు పాచియే దీనికి ఆహారము. ఎడారులలో ఒంటెతప్ప మిగిలిన ఏజంతువును తిరుగజాలదు. ఆహారము సంపాదించుకొనుటకై దాని కడుపులోనుండు తిత్తి విచిత్రమైనది. దాని పాదములు వెడల్పయి మెత్తగానుండుటచే ఇసుకలో దిగబడవు. ఈకారణములనుబట్టి దీనికి ఎడారిఓడ అనిపేరు. ఎడారిని ఆనుకొనియుండు పచ్చికబయళ్లలో సాధారణముగా పచ్చికమేయు జంతువులు విశేషించియుండును. గొఱ్ఱెలు, మేకలు, పందులు, గుఱ్ఱములు మున్నగునవియుండును. అచ్చటిజనులకు ఇవి చాల ఉపయోగకరమైన జంతువులు. ఇవి తినుటకు ఆహారమును, కట్టుకొనుటకు బట్టలును, తోలును యిచ్చును. పచ్చికబయళ్లు ఎక్కడనుండునో అచ్చట అంతయు వీటిని జనులు కోట్లకొలది మేపుచుందురు. పశువులు ఉష్ణప్రదేశములందును వానిని ఆనుకొని యుండు సమశీతోష్ణ ప్రదేశములలోను ఎక్కువగానుండును. మన దేశములో సుమారు 60 కోట్లును, యునైటెడ్

స్టేట్సు (United states) లో 50 కోట్లును ఉన్నవి. మిసిసిపి (Misisipi) నదికి పడమట రాకీపర్వతమును ఆనుకొని యుండు బయళ్లలో వీనిని విశేషించి పెంచుచుందురు. దక్షిణమెరికా లోని అర్జెంటైనాలోను పశువుల సంఖ్య ఎక్కువ. ఆస్ట్రేలియా న్యూజిలాండు బయళ్లలో గొఱ్ఱెల నెక్కువగా పెంచుదురు. యునైటెడ్ స్టేట్సులో మాత్రము 50 కోట్ల పంది లున్నవి. వీనికి జొన్నలుపెట్టి బలిపింతురు.

శీతోష్ణ స్థితిగతుల ననుసరించి ప్రపంచములో పైరు పచ్చలుండును. మిక్కిలివేడియు, వర్షపాతమును గల ప్రదేశము లలో గొప్ప అడవులు పెరుగును. వేడియు స్వల్పవర్షపాతము గల ప్రదేశమున పచ్చిక విస్తారముగా పెరుగును. ఇట్లే సమ శీతోష్ణప్రదేశములలో పచ్చికయు, అందువర్షపాత మెక్కుడు గల ప్రదేశముల పెద్దవృక్షములు పెరుగును. ధ్రువప్రాంతము మంచుగడ్డ ప్రదేశము. ఇచ్చటమంచు గడ్డ కట్టియుండును. పంటలుపండవు. ఇచ్చట వేల్, సీలు, ఎలుగుబంట్లు, రెయిండీరు మున్నగు జంతువు లుండును. అచ్చట జనులను ఎస్కిమో (Eskimo) లందురు. అచ్చట వారు జంతువులను వేటాడి చంపి తిని బ్రతుకుదురు. రెయిండీరుయొక్క పాలనుగూడా త్రాగు దురు. వేటాడుట, చేపలను బట్టుట వీరిముఖ్యవృత్తి. వీరు సెడ్జస్ (Sedjas) అనుబండ్లమీాద మంచుగడ్డలపై ప్రయాణము చేయుదురు. ఈ బండ్లను కుక్కలచే లాగించుదురు.

## టండ్రా భూములు

వీనినే స్లామప్రదేశములని చెప్పనచ్చును. యూరేషియా కుత్తరమునను అమెరికా కుత్తరమునను ఈ పట్టభూములు గలవు. ఇచ్చటకూడ వేసవి తక్కువ, శీతాకాలమెక్కువ, వర్షపాతము తక్కువ. ఇచ్చట నాచు, చిన్నపొదలు పెరుగును. వేసవిలో మంచుకరిగి చాల తేమగానుండును. దోమలు అపరిమితము. ఇతరకీటకములు కూడ విశేషముగానుండును. ఈ ప్రాంతములలో నివసించువారు అనేక తెగలుగానున్నారు. ఉత్తర నార్వేరష్యాలలో వారికి లాప్పు (Lappu) లనియు ఫిన్ను (Finnu) లనియు ఉత్తర ఆసియాలో వారికి ఓస్టయాకులు, సామోయదులు, యాకటులని పిలువబడుదురు. ఈ ప్రదేశములయందు పెరుగుమనుష్యులు చాలకురచగానుందురు. ఇచ్చట జంతువులు వానిరంగులోను, వారి పరిమాణములోను కూడ కురచగా తెలుపురంగుగానుండును. వృక్షములు పొదలు కూడ ఎత్తుగా పెరుగవు. ఈ ప్రాంతములవారికి కూడ రెయిండీరులే ప్రాణాధారములు. వానిపాలను త్రాగుదురు. వానిచే బరువులుమోయించుదురు. వేటాడి చంపి తిందురు. వానిచర్మములను గుడారములకుపయోగింతురు. వాని ఎముకలను పనిముట్లుగ నుపయోగింతురు. ఉత్తరమెరికా టండ్రాభూములలో నివసించువారిని ఎస్కిమో లందురు. కారిబూ అనుఘాతుకమృగములు గలవు. వీరు శీతకాలములో మంచుగడ్డలతో తేనెపుట్టలవలెనుండు యిండ్లలోనుందురు. ఇచ్చట తెల్ల ఎలుగుబంట్లు విశేషము.

## శీతలారణ్య మండలము

కెనడాలో ఉత్తరతీరభాగము, స్కాండినేవియా తూర్పు తీరప్రాంత్యము, సైబీరియాలో కొంత భాగమును "టైగా" (Tyga) అందురు. ఇచ్చట శీతలము తేమగానుండును. శీతాకాలములో శీతలము, వేసవికాలములో వేడియు అధికము గానుండును. ఈ ప్రాంతములందు త్రిభుజాకారము గల వృక్షములు పెరుగును. ఇవి అవి అంత ఎత్తుగా పెరుగవు. వీనిలో దేవదారు మొదలగునవి గలవు. ఈ ప్రాంతములో అనేక మృగములుగలవు. ఇక్కడ నివసించువారికి వేటాడుట ముఖ్యము. కలపవర్తకముగూడ నిక్కడగలదు. ఉత్తరమెరికా, ఫ్రాండులార్డు, నోవోస్కాషియాప్రాంతములలో అనాదినుండియు కలపపని సాగుచున్నది. ఈ కలపనుండి కర్పూరతైలము, తారు మున్నగునవి తీయుచుందురు. వీనిలో మెత్తని కలపనుండి కాగితములను తయారు చేయుదురు. ఈ శీతలారణ్య దక్షిణభాగములో అడవులనుకొట్టి వ్యవసాయము చేయుదురు. ఓట్సు, బార్లీ మున్నగునవి పండును. పశువులను బాగుగా మేపుకొనుటయే యిచ్చట జనుల వృత్తి.

## సమశీతోష్ణ పచ్చికమండలము.

యునైటెడ్ స్టేట్సులో పడమటిభాగము, దక్షిణమెరికాలోని అర్జంటైనారిపబ్లిక్, ఆఫ్రికాలో దక్షిణభాగము, రష్యాలో దక్షిణభాగము, ఆసియాలో మధ్యభాగము, ఆస్ట్రేలియా దక్షిణభాగము, ఈమండలములోనున్నవి. ఇవన్నియు సము

ద్రిమునకు దూరముగనుండి పల్లముగా నుండు ప్రదేశములు. ఇక్కడ శీతోష్ణస్థితి విపరీతముగానుండును. వేసవికాలములో అతివేడిగను, శీతాకాలములో అతిశీతలముగానుండును. వర్షపాతము తక్కువగుటచేత గడ్డితప్ప పెద్దవృక్షములు పెరుగుటకు వీలులేదు. ఈ గడ్డి ప్రదేశములను యూరపు ఆసియాలలో స్టెప్పీలనియు, ఉత్తరమెరికాలో ప్రైరీలనియు, దక్షిణమెరికాలో పంపాలనియు, ఆఫ్రికాలో వెల్డులనియు అందురు. ఇచ్చట జనులు విశేషముగా పశువులను గుఱ్ఱములను మేకలను గొఱ్ఱెలను ఒంటెలను పెంచి వీని బొచ్చుతో కంబళ్ళు నేయుదురు. పశువుల పాలతో వెన్న జున్ను తయారుచేసి ఎగుమతి చేయుదురు. ఆస్ట్రేలియానుండి గుఱ్ఱములు ఎగుమతి చేయబడును. చికాగోవారు పశువుల మాంసమును ఎగుమతిచేయుదురు. దక్షిణాఫ్రికా (South Africa) గడ్డి మండల మగుటచే పశువుల మేపుట ముఖ్యవృత్తి.

## ముఖ్యమైన విషయములు.

గొఱ్ఱెలు మేకలు పెంచబడు దేశములలో గడ్డి విస్తారముగా నుండును. ఆస్ట్రేలియా, యునైటెడ్ స్టేట్సు, అర్జంటైనా, న్యూజిలాండు, బ్రిటన్, దక్షిణాఫ్రికా - ఇవి గడ్డి ప్రదేశములు.

టిబెటు దేశమున "యాక్" అను జడల బఱ్ఱెమీాదను, దక్షిణమెరికాలో "లామా"యను జంతువులపైనను సరకు మూటలనుంచి వ్యాపారము చేయుదురు.

మధ్య ఆసియాలో బీళ్లు విశేషముగానుండును. యాక్

(Yak) అను ఎద్దు యిచ్చటి జనులకు ఆధారముగా నున్నది. ఇక్కడ విశేషముగా జనులు పశువులను మేపుట, వ్యవసాయము, ముఖ్యవృత్తిగా కలిగియున్నారు.

మధ్య యూరప్‌లోనున్న డెన్మార్కు, హాలెండు, బెల్జియం, ఫ్రాన్సు, జర్మనీ మున్నగు దేశములలో చేపలను పట్టుట, పశువులను మేపి జున్ను, పాలు, వెన్న, చర్మము ఎగుమతి చేయుట జరుగును.

ఉత్తరాఫ్రికాలో నున్న మొరాకో, ఆల్ జీరియా ట్యూనిస్, ట్రిపోలి, ఈజిప్టు, కైరో, సహారా మున్నగు ప్రదేశములలోనున్న పచ్చికబీళ్ళలో ఒంటెలు, గుఱ్ఱములు, మేకలు పెంచబడుచున్నవి.

దక్షిణాఫ్రికాలోనున్న పెటోరియా, బ్లాంఫీగ్‌టిన్, గుడ్‌హోప్, కేప్‌టవున్ మున్నగు దేశములలో పంటలు తక్కువ. మేకలు, గొఱ్ఱెలు, నిప్పుకోళ్ళనుపెంచి వాని ఉన్ని, చర్మములు, మాంసము, ఈకెలను అమ్మట వీరి ముఖ్యమైన వృత్తి

సంయుక్తరాష్ట్రములోనిగుడ్‌హోప్, ట్రాంస్‌వాల్, అరేంజి ఫ్రీస్టేట్, నేటాల్, అల్జీరియా, ట్యూనిస్, మొరాకో. సహారా, గినియా, మెడగాస్కరు, సోమలితీరం, నైజర్ ఇవిఫ్రెంచివారివి. అంగోలియా, మొజాంబిక్, గినియా పోర్చుగీస్‌వారివి. లైబీరియా స్వతంత్రదేశము. సోమలాండ్ ఇటలివారిది. అబిసీనియా, లైబీరియా స్వతంత్రదేశములు. ఈ ఖండములో చాలవరకు ఎడారిభూమిగను, మిగిలినది అడవిప్రదేశముగను యున్నది.

ఇచ్చట ఏనుగులు, ఖడ్గమృగములు, జిరాఫీలు, జీబ్రాలు, సింహములు, నీటిగుఱ్ఱములు, మొసళ్ళు, గొప్ప కోతులు, పాములు గలవు.

ఆస్ట్రేలియా (Australia) దేశములో నాలుగవ భాగము వ్యవసాయము. పచ్చికభూమి, బీళ్లుగలవు. పచ్చిక ప్రదేశములలో పశువులను మేపి వెన్న, మీగడ, పాలు తయారుచేసి ఎగుమతి చేయుచున్నారు. ఇచ్చట కంగారు అను విషజంతువులు, చెవులపిల్లులు, తోడేళ్లు, ముఖ్యమైనజంతువులై యున్నవి. మొసళ్ళు, పాములు అనేకరంగుల పక్షులు కూడ విశేషముగా నుండును.

దక్షిణమెరికా (South America)లో నున్న బ్రెజిల్, ఉరుగ్వే, అర్జంటయినా, చిలీ, పెరూ, ఈక్వెడార్, కొలంబియా, వెనుజిలా, బొలీవియా, గయానా దేశములలోను పశువులు విశేషముగా ఎగుమతిదిగుమతి యగుచున్నవి. పచ్చిక ప్రదేశములలో పశువుల పెంచుట ముఖ్యమైనవృత్తి. కోతులు, చిరుతలు, అల్పాకాగొఱ్ఱెలు, లామాఒంటెలు, రియానిప్పుకోళ్ళు మొదలగు జంతువులుండును.

## ఆకురాల్చు అడవిప్రదేశము

యూరపులో పడమటి భాగములు, రష్యా (Russia) మధ్యభాగము, అమెరికాలోని యునైటెడ్‌స్టేట్సులోని తూర్పు భాగము, ఆసియాలోని తూర్పు భాగమును, న్యూజిలాండు ఈమండలములో గలవు. ఈమండలము సమశీతోష్ణమండలము

లోని సముత్వభాగము. ఇక్కడ వర్షపాత మెక్కువ. ఈ మండలములోని చెట్లన్నియు శీతకాలమున ఆకురాల్చును. ఇచ్చట గోధుమలు, బార్లీ, ఓట్సు మొదలగునవి పండును. ఇచ్చటివారు పశువులనుమేపి పాలు, వెన్న, మీగడ ఎగుమతి చేయుదురు. ఇందుకు డెన్మార్కు ప్రసిద్ధి. యంత్రసహాయమున ఈపరిశ్రమలు విరివిగా జరుగుచున్నవి.

## బీటిమేత ఆధిక్యము

మేతలన్నిటిలో బీటిమేత (Fodder) యే శ్రేష్టమైనది. పూర్వము భూమి చాలినంతయుండెడిది. ఇప్పుడు వ్యవసాయదారులు (Farmers) పశువుల యభివృద్ధిని గణింపక పొలమునంతయు వ్యవసాయముచేయుచు బీడును విడిచిపెట్టుటలేదు. కొన్ని ప్రదేశములలో కొంతకాలము ముప్పది యకరముల కొక యకరమువంతున బీడుభూమి యుండవలెనని శాసననియమములు(Laws) ఉండుచూ వచ్చినవి. కాని యిప్పు డవిలేవు. ఇప్పుడన్ననో ధనాభావముచే భూమినంతయు సాగుచేయుచున్నారు. అందువలననే పశువులు క్షీణించుచున్నవి. ఇంగ్లండు, స్విట్జర్లండు, కాలిఫోర్నియా, జపాను, డెన్మార్కు మున్నగు దేశములలో పశువులకై వ్యవసాయదారులు ప్రత్యేకముగా పచ్చికబీళ్లను నెలకొల్పి తదితర మేతలకు బీటిమేతలకు తారతమ్యమును గ్రహించిరి. అన్నిజాతుల పశువులకు బీటిమేత యనిన మిగులప్రీతి. ఈమేత అన్నికాలములయందు తగినంత దొరకునెడల పశువులకు సాధారణముగా మరొకమేత అవసరముండదు. ఇట్లు లభింపనపుడును, విరామములేక పగలంతయు

పనిచేయు పశువులకు దినమంతయు మేసి పొట్టనిండించుకొనుటకు దగిన యవకాశములేక పోవుటచేతను గడ్డి మొదలగునవి తెచ్చివేయుటయేగాక కొద్దిపరిమాణమునందే యెక్కువ సారముగల తెలికపిండి మొదలగు పదార్థములు దాణా వేయవలసియుండును.

## బీళ్లలోని గడ్డిజాతులు.

పచ్చికయనగా నేలపై స్వాభావికముగా మొలచుగడ్డి గాదములు. వీని మంచిచెడ్డలు అందు మెండుగనుండు జాతుల ననుసరించి యుండును. ఈదేశపు పచ్చికబయళ్ల యందుగానఁగు జాతు లనేకములు. వానినింకను బాగుగా బరీక్షించినవారెవరునులేరు. 1907 వ సం॥ న దొరతనమువారి యుద్భిజ్జశాస్త్రజ్ఞులు(Botanists) గుంటూరు, కృష్ణ, గోదావరిజిల్లాలలోని గడ్డి జాతులను కొంతవరకు పరీక్షించినటుల దెలియుచున్నది. కృష్ణా గోదావరి జిల్లాలలో తరచుగా గానగు గడ్డిజాతులలో గరిక, గునుకు, చెంగలి, మొలవ, తుంగ, ఊద, కావురు, ఆముడ, కాండ్రి, చికిలింత, ఊటిక, చిప్ప, ఊసడము, పనగమోకాలు, తొండంగి, పిల్లిపెసర, జనిపె, దర్భ, ఆవుగు, రెల్లు, గెలగడ్డి మున్నగునవి ముఖ్యములు. ఇవిగాక గడ్డికుటుంబములో జేరని గజ్జేరు, ఎలకజెడి, అమృతకాడ, పాలిల మొదలగు ననేక జాతుల మొక్కలుగూడ బీళ్లలో గానగును.

## పుష్టికరమైన జాతులు.

పై గడ్డి జాతులలో గరిక, గునుకు, మొలవ, చెంగలి మున్నగునవి మిగుల బలమైన జాతులును, పశువులు బాగుగా

దినుసవియున్నై యున్నవి. ఊతిక, చిప్ప, తుంగ మొదలగునవి యిసుక గోడి నేలలో బయలు దేరు జాతులు. చవిటి నేలలో ఉప్పి, గజ్జేరు మున్నగునవి మాత్రమే పెరుగును. కాబట్టి పశువుల మేతక్రింద వదలు నేల మంచిదైననేగాని యందలి పచ్చిక యందు మేయు పశువులకు బలమును ఆరోగ్యమును (Strength and Health) గలుగవు. కాని మంచి నేలలు విలువగలవగుటచే పశువులబీటక్రిందనుంచక రైతులు వ్యవసాయమును బెట్టి యిందుకు పనికిమాలిన నేలలనే బీళ్లక్రింద నుంచుదురు. కొందరింతమాత్రమును జేయక నేలనంతటిని సేద్యముచేయుదురు.

## బీటిమేతయే బలమెక్కువ

బీటిమేత దినినపశువులు మిగుల బలముగానుండును. పాడిపశువులపాలు చాలరుచిగానుండును. కాని యిప్పటి వ్యవసాయదారులు ఊడ్పుచేలగట్లను మాత్రమే మాగాణి రైతులు పశువులమేతకై ఉపయోగించుచున్నారు. అందున్న పచ్చిగడ్డి తగినంతసారము లేక పశువులమేతకై చాలకపోవుటచే ఉలవలు, తవుడు, తెలికపిండి మొదలగు కృత్రిమాహారములను కల్పించుచుండిరి. ప్రకృతి సిద్ధముగ పెరిగిన పచ్చికబయళ్ల యందు పశువులు మేత మేయుట శ్రేష్ఠమైన పద్ధతి. బీళ్లనుపెంచుట యన్ని ప్రాంతములందు సాధ్యముకాదు. అంత మాత్రముచే రైతులు నిరుత్సాహపడి పశువుల మేతవిషయమై లోటు కలిగింప నక్కరలేదు. సామాన్యముగా వర్షాకాలమునందు బీటిమేతకొరకు తదితర తాలూకాలవారు ఉత్తరాది

తోలుదురు. పశువులు మిక్కుటముగా బలిసి ఆనందదాయక ములుగా నుండును. బీటిమేత దినుటవలన పశువులకు సాధారణముగా వ్యాధులు రాజాలవు.

## మాగాని మెట్టభూములలోని వ్యత్యాసములు

మెట్టభూములలోని మేతకు, మాగాణి భూములలోని మేతకు చాల వ్యత్యాసము (Difference) యున్నది. మెట్ట భూమి మేత దినిన పశువులు బిగుతరముగానుండును. మాగాణి భూమిమేత తినిన పశువులు బిగుతరము తప్పియుండును. మెట్ట భూములలోనున్న పశువులకు ఎల్లప్పుడు పనియుండుటవలన ఆరోగ్యము బాగుగానుండి అంటువ్యాధులు (Contagious diseases) వగైరా అంతగాసోకవు. బీటిమేత తినిన పశువుల పాలనుంచి వచ్చు వెన్న గట్టిగానుండును. మాగాని భూముల లోని మేత నిస్సారముగనుండును. బీటిమేత స్వాభావికమగుట చేత పశువులకు మిగుల నారోగ్యకరము. మనము తదితర మేత లెంత బెట్టినను పశువులకు బీటిమేతయంత సంతోషదాయ కముగను, బలముగను నుండదు. బీళ్లలో ననేకజాతి గడ్డి గింజ లుండుటచే పశువులకు గావలసిన వివిధవస్తువులన్నియు నందుం డును. మన మేదేని ఒకరకపుగడ్డి కోసిమేపినను యితరాహార మును బెట్టినను అందు పశువులకు గావలసిన ద్రవ్యములలో గొన్ని యెక్కువగను, మరికొన్ని తక్కువగను యుండుట తటస్థించును. మరియు పశువులు ఎండుమేతకంటె పచ్చికను మిగుల నిష్టముతో దినును. కావున నీదేశమున పశువుల యభి

వృద్ధి కోరువారు సాధ్యమైనంతవరకు వానికి బీళ్లు అమరునట్లు జేయ ప్రయత్నించవలెను.

## ఎరుపునేలలయందు విత్తనముల నుపయోగించుట

పశువుల బీటికిక్రింద వదలునేల మంచిదైననేగాని యందలి పచ్చికయందు మేయు పశువులకు బలము ఆరోగ్యము కలుగదు. మెట్టతాలూకాలలో ఎరుపునేలలు (Red lands) విశేషముగా బీళ్లు వదలబడుచున్నవి. కాని యిందు వర్షము కురియుచున్నంత వరకేగాని అటుపిమ్మట త్వరలో పదునారి పోవుటచే గడ్డియంతగా బట్టదు. పశుజాతులైనను ప్రశస్తముగా నుండవు. కోయంబత్తూరు జిల్లాలో బాగుగా పట్టని ఎఱ్ఱనేలలోను కంకరనేలలోను కొలకగడ్డియను ఒకజాతిగడ్డి విత్తులనుజల్లి ప్రత్యేకముగా బీళ్ళను తయారుచేయుదురు. ఒక పర్యాయము జల్లి ఏడెనిమిది సంవత్సరముల వరకు బీడుగా వదలి తరువాత మరల సాగులోనికి తీసికొనివచ్చుదురు. ఎకరమునకు రమారమి ఎనిమిదిపౌనుల విత్తులుపట్టును. ఈగడ్డిని ప్రత్యేకముగా అప్పుడప్పుడు గంటె జొన్న నూవు మొదలగు సస్యములతో గలిపి జల్లి యాపంటను తీసివేసిన తరువాత నేలను బీడుగావదలుదురు. ఇట్టి విత్తులను జల్లి బీళ్లనుపెంచు పద్ధతి తెలుగు జిల్లాలలోగూడ నవకాశము గలవారవలంబించెదరుగాక.

## బీళ్ళలో సున్న మెక్కువకావలయును

బీళ్ళలో పెరుగుగడ్డిజాతులు సున్నము(Lime)నెక్కువ దీసికొనును. కాబట్టి లోతుగనుండు నల్లనేలలో నపుడపుడు

సున్నము జల్లుటమంచిది. గరికగడ్డికి సున్నము మరింతయిష్టము. కోయంబత్తూరు జిల్లాయందలి నేలలలో నప్పుడప్పుడు సున్న మెక్కువగ నుండుటచేత నచ్చట బీళ్ళలో గడ్డి బాగుగా పెరుగు చున్నది. మధ్యపరగణాల (Central Provinces) లో నున్న కొన్నిజిల్లాలలో ఆవుల, ఎద్దుల పోషణనిమిత్తము ప్రత్యేక అధికారుల నియమించియున్నారు. అడవులను (Jungles) వ్యవసాయమునకు చెలికత్తెలందురు. తగినగడ్డినిపెంచి నిలుపుదల చేసి అడవులలో మేపుటకంటెను గడ్డికోయించి అమ్ముట మంచిది.

## బీళ్లలోని పశువులను కాపాడుట

పశువులమేతకై భూమి సాగుచేయక బీడుగా విడిచి పెట్టుట ప్రాముఖ్యమైన విషయము. బీళ్లలో సర్వకాలముల యందును చక్కని పచ్చికయుండు టవసరము. నీడయును శుద్ధోదకమును ముఖ్యములు. పశువుల నూరివెలుపల సంచారము లేని చోట్ల మేపునెడల నవి మనుష్యుల చూడగనే బెదరిచూచు చుండును. అందువలన నిర్జనప్రదేశములలో మేతమేయుటకు పశువుల కలవరచరాదు. పశువులకాపరులు (Cattle Attendants) తమకు తీరికగా నున్నప్పుడెప్పుడో పశువులకు నీరు బెట్టజూతురు గాని సరియైన వేళకుమాత్రము పెట్టరు. మన యిండ్ల యందున్న పశువులకన్న బీళ్లలోనుండు పశువులు స్వేచ్ఛగా నుండును. బీళ్లలోనుండు పశువులు మనుష్యులను చూడగనే బెదరుగాచూచుచుండును. అందువలన పశువులు మచ్చికకు సరిగా రాజాలవు. అందుచేతనే అరణ్యములలో నుండు పశువు

లను మచ్చికచేసి పట్టుకొనుట కెంతో ప్రయత్నించెదరు. అట్లు ప్రయత్నించి తీసికొని వచ్చి యింటివద్దనుంచి మేపినను వాటి పౌరుషము మాత్రము చావదు. బీటిలో మేయు పశువులను అప్పుడప్పుడు గ్రామములలోనికి తోలుకొనివచ్చి ఆబీటి మేత కోసికొనివచ్చి మేపుట మంచిపద్ధతియై యున్నది.

పశువుల కాపరులను బట్టికూడ ఆపశువులు తగినచేష్టలు చేయుచుండును బీటిపశువులకు క్రౌర్యము, తామసము, అహంకారము ఎక్కువగానుండును. పెద్దపులులు మొదలగు ఘాతుక జంతువులు బీళ్లలోనున్నవని అనుమానమున్నపుడు కాపరులు జాగ్రత్తగా చూచుచుండవలెను. పశువులకు నియమితవేళల నేర్పరచి నీరు పెట్టుచుండవలెను. అక్కడనున్న పశువులలో నేదైన జబ్బుగానున్నదో, పోట్లాడుకొనుచున్నదో, ఏదైన దెబ్బతగిలి రక్తము కారుచున్నదో, ఈనుకొని పోయినదో మొదలగునవి బాగుగా పరీక్షించి తగిన శ్రద్ధ తీసికొనవలెను.

బీళ్లలో చర్మముకొరకు మాదిగెవాండ్రు పాషాణపొడిని, దొమ్మ,గురకచేచనిపోయినవాటి పేడను జల్లుదురు. అట్టి మేతతిని పశువులు చనిపోవుటయుగలదు. కావున రైతులు అప్పుడప్పుడు బీళ్లను పరీక్షించుచుండవలెను. ఇంకను విషపురుగులుగాని దుష్టసర్పములుగాని జంతువులుగాని బీళ్లలో నివసించి పశువులను చంపుచున్నది లేనిది చూచుచుండవలెను. పెద్దరోగము, గురక దొమ్మ మొదలగు అంటుసంబంధమైన రోగములు (Contageous diseases)వ్యాపించుచున్నవి లేనివి పరీక్షించుచుండవలెను.

## గ్రామ కట్టుబాట్లవసరము

గత శతాబ్దములో దేశములో జనాభా వృద్ధియగుట చేత వ్యవసాయమునకు అనుకూలముగాని భూములన్నియు ఆక్రమించుకొనబడినవి. మైదానములన్నియు పల్లెలుగా మారినవి. అందుచేత క్రమముగ పశువులకు వలసిన పచ్చిక లేకపోయినది. వాని జవసత్వములు (Strength and energy) క్షీణించి పోవుచున్నవి. కాబట్టి మరల పచ్చిక భూములను పెంపొందింపవలసిన యవసర మెంతేనియు గలదు. మనహిందూ దేశములో విశేషముగ పచ్చికబీళ్లులేవు. విశేషముగ లేకున్నను ఉన్నవానిని అభివృద్ధి చేయుటకు మార్గము లుండకపోలేదు. అనేక గ్రామములచుట్టు పశువుల మేతనిమిత్తము కొంత బంజరుభూమి యుండును. అట్టి బంజరుభూములలో తంగేడు, జిల్లేడు, తంటెపుచెట్లు మున్నగు పనికిరాని చెట్లు పెరిగి ఆస్థలమును ఆక్రమించుకొనుచుండుట మనమందర మెరిగిన విషయమే. ఇట్టి భూములలోనుండు పనికిరాని చెట్లను నరికివేసి బీటి సంబంధమగు మేతలువేసి పెంచి గ్రామపశువులను మేపుచుండుట మంచిది. ఇటువంటి పనులు చేయుటకు గ్రామములో సంఘీభావము (Unity) కావలెను. ఇప్పటి పరిస్థితులలో ప్రతిగ్రామమునందు పార్టీలుండుట తటస్థించుచున్నవి. ఈపార్టీలుండుటవలన పశుగ్రాసము (Fodder) నశించినది. కాలువ గట్లమీదనుండు గడ్డికూడ రెట్టింపు ధర పెట్టి కొనవలసివచ్చుచున్నది. గ్రామ పోరంబోకలలో నిదివరకు ఐకమత్యముగా నున్నపుడు తమయిష్టప్రకారము అపర

సస్యములువేసి పెంచెడివారు. తగాదాలున్న గ్రామములలో ప్రభుత్వమువారికి పితూరీలుచెప్పి ఉభయులుకలసి పశువుల నోటిలో గడ్డకొట్టుచున్నారు. ఈరీతిగా మన దేశములో రైతుల కైకమత్యము లేక పశుసంతతిని నాశనము చేయుచున్నారు. గడ్డిజాతుల పేర్లే మరచిపోవుచున్నారు. కాలమునకు తగినట్లుగ పైరులు వేయక సరిగా పంటలు పండించక ఎరువులనుతోలక పశువుల మేతవిషయమై పశువుల బీళ్లవిషయమై తగిన కట్టు బాట్లు చేయక పశుసంతతిని పాడుచేయుచున్నారు.

## బీళ్లను వృద్ధిజేయుట

పచ్చికబయళ్లసంఖ్య పెంచుటకు శీఘ్రముగ ప్రజాభి వృద్ధియగుచున్న దేశములయందు వీలులేదుగాన పూర్వము నుండి వచ్చుచున్న పచ్చికబయళ్లయందే ఎక్కువ పచ్చికను పెంచు విధానముల నవలంబించవలెను. గ్రామములకు సంబంధించిన బయళ్లయందు పశువులమందలను విచ్చలవిడిగా వదలి వేయక అట్టి బయళ్లను కొన్ని భాగములుగా విభజించి ఒక్కొక్క భాగము కొన్నిదినములు మేయునట్లు చేయవలెను. ఈరీతిగా చేయుటవలన మిగిలిన భాగములయందు పచ్చికపూర్తిగా పెరుగుటకు వీలగుచున్నది.

బీళ్లకు వర్షముకురిసినవెంటనేగాని, బీళ్లలో నీరునిలిచి నప్పుడుగాని పశువులను తోలి మేపరాదు. అట్లు మేపిన యెడల గడ్డినంతయు త్రొక్కిపాడుచేయుటయే గాక మంచి రకపుగడ్డి అంతయు నాశనమగును. గడ్డి పెరుగు ఋతువుల (Seasons) యందు పశువులను తోలరాదు. మేతబాగుగా పట్టి కొంచెము

ముదిరిన తరువాత మేపవలెను. జిల్లేడు, రెల్లుదుబ్బులు, నల్ల ఉమ్మెత్తాకుచెట్లు, మున్నగు పనికిరాని మొక్కలను తీసివేసి మంచి రకములగడ్డిజాతులను పెంచవలయును. మంచి విత్తనమును వేసి పెంచి కాయలుకాయించి ఎండించిన తరువాత గొఱ్ఱెలను మేకలను బీటినాలుగువైపుల త్రిప్పినయెడల ఎండిన కాయలు బద్దలై బీడంతయు వ్యాపించును. వేసవికాలములో బీళ్లలో మేపరాదు. గడ్డిపెరుగుకాలములో అపుడపుడలచేసి మంచి గడ్డి జాతులు విత్తనములు ముదిరిన తరువాత పూర్తిగా మేపవలెను. మంచిరకపు గడ్డిని ముఖ్యమైనపశువులకు మేపి తక్కిన వాటికి రెండవరకము మేపుట రైతునకు సునాయాసముగా నుండును. బీళ్లలో నీరుత్రాగు గుంటలుగాని, చెరువులుగాని ఎక్కువగా నుండరాదు. అట్లుండుటవలన బీళ్లు తేమగలిగి పాడగును. ఇంతియేగాకుండ పశువులు మాటిమాటికి నీరు త్రాగుటకు వెళ్లి మంచిజాతిగడ్డిని పాడుచేయుచుండును. విషపురుగులు, దుష్టజంతువులు, దుష్టసర్పములుండు పుట్టలను నిర్మూలించవలెను.

## ఆహారముగ నుపయోగించుట

పశువులకు దీనిని ఆహారముగ వేసి పరిశోధింపగా మంచి ఫలితము కన్పట్టెను. పశువులకు మేపిన పుష్కలముగా పాల నిచ్చును. పాలనిచ్చును గదాయని పశువుల కమితముగా మేపరాదు. ఎక్కువగా మేపిన పారుడురోగము సంభవించును. ఒక పౌను పచ్చిగింజలపొట్టు ఎంతబలము చేయునో సుమారు 8 పౌనుల బొమ్మజెముడు అంతబలముచేయును. ఎండుగడ్డి మేత

కొంతతగ్గించి దినమునకు ఒక్కొక్క పశువునకు 60 నుంచి 75 పౌనులవరకు బొమ్మజెముడు మేతపెట్టితిమేని మంచి పాలు పడును. కాని పాలలో వెన్న (Butter) నూటికి 42 వంతున తగ్గి పోవును.

ఈ మేతమేసిన పశువులు నీరు విస్తారముగ త్రాగవు. ఉదకక్షామము గల జిల్లాలలో ఈజెముడు చాల ఉపయోగకరము. ఈమేతతిను పశువులు బాగుగా పాలిచ్చునని వ్యవసాయశాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు. ఈమేతను కమలునట్లుగా అనగా దోరగాకాల్చి పశువులకు వేయుటమంచిది. కేసోలన్ (Kesolan)కాగడాతో కాల్చినయెడల ఒకకూలివాడు 50 నిమిషములలో ఒకటన్ను జెముడు కాల్చవచ్చును. ఈమేతను ప్రత్తిగింజలతోగాని, ఎండుగడ్డితోగాని కలిపియిచ్చుట మంచిది. ప్రత్యేకముగా దీనిని మేపుట అంతమంచిదిగాదు. మెరక గ్రామములలో కొన్నిచోట్ల నీరులేక ప్రజలే బాధపడుచున్నపుడు ఈమేతను పశువులకు నుపయోగించి లాభమును పొందెదరు గాక.

## పశుసంతతి నభివృద్ధిపరచుట

ప్రస్తుతము పశువులు చాలహీనస్థితిలోనున్నవి. అన్ని దేశముల కంటెను మనదేశములో పశువుల సంఖ్య హెచ్చుగానున్నది. భారతదేశములో సాగుబడి చేయుచున్న నూరు ఎకరములకు సరాసరి 67 పశువులుగలవు. కాని వ్యవసాయము (Cultivation) లో అత్యున్నత దశలోనున్న హాలెండు (Holland) దేశములో సాగుబడి చేయుచున్న నూరు ఎకరము

లకు 38 పశువులు మాత్రమేగలవు. వ్యవసాయము దుస్థితిలో నున్న ఈజిప్టు (Egypt) దేశములో సైతము నూటికి 25 పశువులు మాత్రమే గలవు. ఇట్టిపరిస్థితులలో భారత దేశము (India) లోని వ్యవసాయదారులు అనవసరముగా చాలపశువులను మేపుచున్నారని తేటతెల్లమగుచున్నది. చాల పశువులుండుటచే పాపము రైతు వానికి తగినంత మేత పెట్టజాలకున్నాడు. అతను మేపుచున్న పశువులలో నూటికి 70 పశువులు పనికివచ్చుటలేదు. తదనంతరము భారత వ్యవసాయ దారుల పశు సముదాయములో చాలముసలి పశువు లున్నను వానిని విసర్జింప నంగీకరింపడు.

## రైతులు తగినంత శ్రద్ధ తీసుకొనవలెను

పశువులకు రోగములు సంభవించి నప్పుడు దైవమహాత్మ్యమువలన వచ్చెనని రైతు ఊరకొనును. అన్నిటికంటె ముఖ్యమైన విషయమొకటిగలదు. తనవద్దనుండు పశువులను మేపుటకు తగినమేతగాని, పచ్చిక పొలములుగాని భారత వ్యవసాయదారుడు నెలకొల్పలేకున్నాడు. తాను వ్యవసాయము చేయుచున్న కొలదిఎకరములలో కొంతమేర పశువులకై యితను విడిచిపెట్టినయెడల రైతు తనకు వచ్చు ఆదాయము తగ్గునని చాలభయపడుచున్నాడు. కనుక పంటకోసిన తరువాత వచ్చుగడ్డి, తుక్కు మొదలగువానిపై పశువులు ఆధారపడుచున్నవి. వ్యవసాయదారుడు నిలువయుంచు మేత తన పశువులకు సాలునకు ఆరుమాసములైనను రాజాలదు. కనుక సాలునకు ఏడుమాసములు పశువులకు మేతలేదని అర్థము. అం

దుచేతనే పశువులు నీరసస్థితిలో నుండుచున్నవి. తత్కారణముచే అట్టి పశువులు వ్యవసాయదారునకు అలంకారార్థమే కాని తగు సహాయము చేయలేకున్నవి. దీనినిబట్టి మనకు తెలియు విషయమేమనగా పశుసంతతి యభివృద్ధి కావలెనన్నచో పశువుల మేతకై వ్యవసాయదారుడు తగు శ్రద్ధ తీసికొనవలెను. అందువలననే కేటింజి (Ketinj) అను మహనీయుడు పశువులు పెంపొందుటకుకూడ మేతవిషయమే ముఖ్యమని చెప్పియున్నాడు.

## శాస్త్రసమ్మతమైన పచ్చికను పెంచవలెను

రైతు తనపొలములో కొద్దిభాగమునైనను మేతకై విడిచి పెట్టిన బాగుండును. దీనివలన వ్యవసాయదారునకు చాలనష్టము వచ్చుననియు, సామాన్యముగా మన దేశములో ప్రతిరైతు సరాసరి అయిదు ఎకరములకు తక్కువగనే సాగు చేయుచున్నందువలన కొంతభాగము పచ్చికకై విడచుట కష్టసాధ్యమని కొందరిఅభిప్రాయము. ఇదెంతమాత్రము నిజము కాదు. ఇంగ్లండు (England) స్వీడను (Sweeden) జపాను (Japan)మున్నగు దేశములలో పశువులకై ప్రత్యేకముగా వ్యవసాయదారులు పచ్చిక బయళ్లను నెలకొల్పుదురు. రైతు ఒకదినము ఆహారము లేనప్పుడు ఎట్లుండునో, తనపశువులుకూడ తగు ఆహారములేనప్పుడు అట్లుండునని గ్రహించవలెను.

రైతు కొంతభాగము తన పశువుల మేతకై ప్రత్యేకముగా నియమించిన యతనికి తీవ్రనష్టమువచ్చునను మాట

అసత్యము. 10 యకరముల పొలము సేద్యము చేయుచున్నా డనుకొందము. 10 ఎకరములలో ఒకఎకరము పశువుల మేతకై వినియోగించిన అతనికి సుమారు 40-0-0 కంటె హెచ్చునష్టం రానేరదు. కాని సాధారణముగ పది ఎకరముల సాగు చేయబడుచున్న రైతునకు 2 ఎద్దులు 1 ఆవు లేక ఒక గేదె అయినను తప్పక యుండును. వానిమేతకై యితడు సాలునకు 80-0-0 లైనను ఖర్చుపెట్టును. ఈ 80-0-0 లలో సుమారు 40-0-0 లేక 30-0-0 లైనను యితను పచ్చిగడ్డి, తెలికపిండి మున్నగువానిని కొనుటకు వినియోగించుచుండుటచేత ఇతనికి 10-0-0 ల లాభమేనని చెప్పవలసియున్నది. ఎందుచేతననగా యిప్పటి పరిస్థితులనుబట్టి అరఎకరము సాగుబడి చేసిన సుమారు 20-0-0 లు వచ్చును. పచ్చిగడ్డి మొదలైనవి కొనుటకై సుమారు యితడు 30-0-0 లైనను ఖర్చు పెట్టవలసియుండును గాన యితడు తన పొలములో కొంతభాగము పచ్చికకై విడిచియుంచిన బాగుండును. ఇదియునుగాక వ్యవసాయదారునకు పశువులను మేపుటచే పాలు, పెరుగు, ఎరువు మొదలగునవి కొనకుండనే వచ్చుచున్నవి. భారతదేశములో మార్చి మొదలు జూలై వరకు పచ్చికయుండదు. అకస్మాత్తుగా వర్షములు కురిసినవెంటనే పచ్చిక బయలుదేరును. ఆకలైన కొలది పశువులు హెచ్చుగా తినుటచే రోగములు వచ్చుచున్నవని అనేకమంది శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. వేసవిలో పశువులను సరిగా మేపినగాని తొలకరిదుక్కులకు పనికిరావు.

కనుక ప్రత్యేకముగా నియమింపబడిన పచ్చిక బయళ్ళలో రైతులు నవీనశాస్త్రసమ్మతమైనపచ్చికను పెంచుచుండవలెను.

## విదేశములలోని బీళ్ళు

ప్రభుత్వమువారు ప్రజలునుగూడ పశువులమేత కుపయుక్తమగు భూములను మెల్ల మెల్లగా ఆక్రమణ చేయుచున్నారు. అందువలన పశువులమేతకు ప్రత్యేక స్థలములు లేకపోవుచున్నవి. ప్రస్తుతము పొలములు అడవులు ప్రభుత్వమునకు లాభము కలిగించుచున్నవి. మంచిభూములపై శిస్తు వసూలుచేసి నాసిభూములను బీళ్ళక్రింద నుంచవలెను. కాని బీడుభూములలో పచ్చిక తిని మంచిపాలిచ్చు పశువులు (Good cows) ఎద్దులు పుష్టితో పనిచేసిన వ్యవసాయపు లెక్కయందున 39688000 కన్న ఎక్కువ ఎకరములు ప్రభుత్వాదాయము హెచ్చును. ఇతర దేశములతో పోల్చిచూచిన మన దేశము పూర్తిగా వెనుకంజ వేయుచున్నది. ఒక్కొక్క పశువునకు స్వేచ్ఛగా మేపుటకు అమెరికా సంయుక్త రాష్ట్రముల (United states of America) లో 1.6 ఎకరములున్న న్యూజిలాండు (Newzeland) లో 1.35 న్న జర్మనీ (Germany) లో 1.44 న్న యుండగా మన దేశములోను బెంగాలుదేశములోను వానికంటె చాల తక్కువగా నున్నవి.

ప్రతి రాష్ట్రమందును సహజముగనున్న పచ్చికబీళ్ల పరిమితి యెంతయో నిరూపింపబడినది. నూరుఎకరముల సాగు భూమికి పచ్చికబీళ్ల పరిమితి యెంతయో తెలుపబడినది.

| రాష్ట్రము | నూరుఎకరముల సాగు భూమికి పచ్చిక బీళ్ళ పరిమితి ఎకరములు | నూరుఎకరముల సాగు భూమికి సాధారణముగా పశువుల సంఖ్య | నూరుఎకరములసాగు భూమికి ఎద్దుల సంఖ్య | నూరుఎకరముల సాగుభూమికి మొత్తం పశు సంఖ్య |
|---|---|---|---|---|
| అస్సాము | 242 | 87 | 10 | 97 |
| బెంగాలు | 33 | 104 | 4 | 108 |
| బీహారు ఒరిస్సా | 56 | 69 | 13 | 82 |
| బొంబాయి | 33 | 24 | 7 | 31 |
| సింధు | 195 | 42 | 11 | 53 |
| బర్మా | 374 | 30 | 7 | 37 |
| మధ్యపరగణాలు | 107 | 39 | 8 | 47 |
| మద్రాసు | 79 | 49 | 17 | 66 |
| పంజాబు | 62 | 37 | 19 | 56 |
| సంయుక్త రాష్ట్రములు | 52 | 64 | 24 | 88 |
| బ్రిటిష్ ఇండియా మొత్తం | 92 | 53 | 14 | 67 |

ప్రతిరాష్ట్రమందును సహజముగనున్న పచ్చికబీళ్ల పరిమితి యెంతయో ఎన్నెన్ని ఎద్దులుగలవో తెలియగలవు. ప్రతిరాష్ట్రమందును సహజముగనున్న పచ్చికబీళ్ల పరిమితి యెంతయో గూడ నిరూపింపబడినది. నూరు ఎకరముల సాగుభూమికి పచ్చికబీళ్ల పరిమితి యెంతయో నిరూపింపబడినది. ఇది బ్రిటీషు ఇండియా లెక్కలనుబట్టి వ్యవసాయవిచారణసంఘమువారు తెలిపియున్నారు. మన దేశమున సాగుచేయని భూమి చాలగలదనియు, అందుచే పచ్చికబీళ్ల పరిమితి నిచ్చునపుడా భూమినంతను చేర్చవలెననుచున్నారు. అరణ్య ప్రదేశముల యందలి పచ్చిక సాగుప్రదేశములయందున్న పశువులకు నిరుపయోగముగానున్నది. అందుచే ఇట్టి లెక్కలను తయారుచేయునపు డట్టిభూములను నిజపరిస్థితులను మరుగుపరుపవచ్చును. కాన వానిని విడిచిపుచ్చుటయే మేలుగా కన్పట్టుచున్నది.

## పశువులను బెంచు సహకారసంఘములు

మన రాజధానిలో చాలభాగము వ్యవసాయమే ముఖ్యమైన వృత్తిగానున్నది. నూటికి 75 మంది వ్యవసాయమువలన జీవించుచున్నారు. హిందూదేశపు కృషీవలుని జీవితము పశువులమీదనే ఆధారపడియున్నది. పశ్చిమదేశ ప్రాంతములందు వ్యవసాయపుపనులు ఆవిరిశక్తిచే నడుపబడు మోటారు మడకలు, ఆయిల్ ఇంజనులు, మోటారు లారీలు, మున్నగు యంత్రములచేత జరుపబడుచుండగా హిందూదేశపురైతు తన వ్యవసాయపుకార్యములకు పూర్తిగా పశువులమీదనే ఆధారపడి యున్నాడు. అతడు తన పశువులేనిచే అంగుళమైన కదల

లేదు. భూమినిదున్నుటకును, పైరునకు నీరుకట్టుటకును మరియు బండినిలాగుటకును ఎద్దులు (Bullocks) అత్యావసరములు. తన గోవులనుండియే పాలు (Milk) సంపాదించుకొనవలెను. భూములకు కావలసిన ఎరువు (Manure) కూడ తన పశువుల నుండియే సంపాదించవచ్చును. ఈరీతిగా పశువులు వ్యవసాయమునకు ప్రాణాధారములైనవి. నిరంకుశమైనపెంపు, నీరసమైనమేపు, నిరాదరణమైన నివాసము మున్నగునవి యుండుటచే పశుసంతతి క్షీణించుచున్నది.

నిరంకుశమైనపెంపు - సహకారసంఘములు.

గ్రామములలో నీవిషయమై చాల అశ్రద్ధ కలుగుచున్నది. బుడ్డకొట్టని, బాగుగా నెదుగని, యితరపశువులతో ఆవులను కలిపి మేతకు తోలుచున్నారు. అట్లు తోలునపుడు ఆవులు ఎదయగు సమయములలో నీఎదుగని ఎద్దులతో కలసి సంపర్కము చేయుటవలన వంగసము చెడుచున్నది. అదే కారణమువలన ఈదూడలయొక్క సంతతికూడ వానికంటె దుర్బలమగుచున్నది. ఇట్లు స్వేచ్ఛగా తిరుగనిచ్చుటవలన గ్రామములోనున్న పశువులన్నియు కొలదికాలములో క్షీణదశకు వచ్చుచున్నవి. రైతుకూడ తన పశుధనమును గోల్పోవుచున్నాడు. ఇటువంటి పద్ధతిని మాన్పించి తగినకట్టుబాట్లు చేయవలెను. ఈవిషయమై సహకార పద్ధతులమీద చక్కగా నెరవేర్పవచ్చును.

రెండుమూడు దగ్గరగా నుండు గ్రామములను కలిపి పశువులను పెంచుట కొరకు సహకారసంఘము (Co-operative

Society) నేర్పరచవలెను. ఆసంఘపు మెంబర్లయొక్క ఆవులను దాటుటకు సంఘధనముతో ఒకటి లేక రెండు మంచిఎద్దులను కొనవచ్చును. ఇట్టి ఎద్దులను సమకూర్చుటకు వ్యవసాయ సంఘము సహాయపడును. ఇట్లు నియమముగా నంగీకరింపబడిన యెద్దును సంరక్షణచేయుటకుగాను వ్యవసాయపు డిపార్టుమెంటు (Agriculture Department) వారు నూరునుంచి నూటఏబది రూపాయలవరకు గ్రాంటు నిచ్చుదురు. అట్టిఎద్దుచే దాటబడిన ఆవులకు కొంత రుసుము విధించవలెను. మెంబర్ల ఆవులన్నియు సంఘపు ఎద్దుతోనే దాటబడునట్లును, అట్లు చేయనియెడల మెంబర్లు జరిమానా (Fine) కు పాత్రులగునట్లుగాను కట్టుదిట్టములు చేయవలెను. ఇట్లు ప్రతిఎద్దుయొక్క సంతతినిచూపుటకు ఒక రిజష్టరు యుండవలెను. ఆవులను జాగ్రత్తగా చూచుచుండవలెను. ఎందుచేతనన శ్రేష్టమైన ఎద్దులే శ్రేష్టమైన ఆవులను దాటుట ముఖ్యము. ఆవుయొక్క వయస్సు, స్వంత ఆసామిపేరు, ఆవును దాటిన యెద్దుపేరు, దాటిన తేదీ మొదలగు వివరములు తెల్పు నొకపెద్దపుస్తకము నుంచవలెను.

సంఘపు సరిహద్దులలోనుండి దాటుట కేర్పడిన ఎద్దులు తప్ప మిగత అన్ని ఎద్దులకు స్వల్పవయస్సులోనే విత్తులు కొట్టవలెను. అప్పుడప్పుడు మందను పరీక్షచేసి లోపముగల లేక వ్యాధి గ్రస్తమైన జంతువులను తీసివేయ వలయును. ఇదివరకు చెప్పిన కలిపిమేపుట ఆపివేయవలెను. మెంబర్లు పచ్చికబీలము గాని లేక దున్నతగిన భూములుగాని మరియేవిధముగానైనను

సంఘము సంపాదించుకొని పశువులమేతకు పైరులను కూడ నుంచుకొనవలెను. అట్టి భూములను మెంబర్లు పశువులకు మాత్రమే ఉపయోగించవలెను. ఆవులు పెయ్యలు వానివాని రకమును బట్టి వేరువేరు మందలుగా అవుసరమున్నపుడు విభజించవచ్చును. ప్రతిమందకును ఒక ఆవరణమేర్పరచి ఒక్కొక మందకు ఒకఎద్దు ప్రకారము మంచి జాతిఎద్దులను (Good bullocks) ఆవులతో కూడ మేయుటకు పంపవచ్చును. ఈపద్ధతిని జాగ్రత్తగా అవలంబించిన యెడల పశుజాతిపెంపును శుభ్రపరచడమేగాక వంగసమునుకూడ వృద్ధిలోనికి తేవచ్చును.

## నీరసముగా మేపుట

పశువులను చక్కగా పెంచుట ఎంత అవసరమో వానిని మేపుటకూడ నంతఅవసరము. పాలిచ్చుపశువులు కావలెను. బరువులు మోయుటకు బలముగల ఎద్దులుండవలెను. ఇటువంటి ఎద్దులను బాగుగా మేపవలెను. ఎద్దునకు మోటలాగుట, దుక్కిదున్నుట, మొదలగు పనులుచేయు వయస్సువచ్చినప్పుడే మేపుట ఆరంభించవలెను. దూడలను అనాదరణముగా జూచుచుందురు. అందుచేతనే అవి దుర్బలముగానుండును. చక్కగా మేపినయెడల అవి ఎద్దులుగాగాని, ఆవులుగాగాని తయారగును. అవి మంచివెలకు కూడ అమ్ముడు (Sale) బోవును. ఈరీతిగా పశువులకు మంచి ఆహారమునిచ్చి పోషించిన యెడల రైతున కెంతో లాభకరమని తెలిసికొనవలెను.

## నిరాదరణమైన నివాసము

పశువులు అనారోగ్యకరమైన ప్రదేశములయందుంచ బడుటవలన వివిధరోగముల పాలగుచుండును. క్రమేపి కృశించి చనిపోవును. గ్రామములో అంటువ్యాధులు సంభవించినప్పుడు అవి విజృంభించి చాల ప్రమాదము కలుగజేయును. అట్టి సమయములందు చాల హెచ్చరికతో పశువులను ప్రత్యేకపరచి జాగ్రత్తగా కాపాడవలెను. పశువులను భీమా (Insurance) చేయుటవలన గ్రామస్థులు చాలఅనుకూలమును పొందుదురు. సహకారసంఘముల నేర్పరచిన యెడల నీరసమైన మేపునుండి నిరాదరణమైన నివాసమునుండి కలుగు ఆపదలను చాలవరకు ఆపివేయవచ్చును.

## విశ్రాంతిస్థలములు.

మనకు జీవనాధారము పంట. పంటకుఆధారము పశువు. పాడిపంట జీవకళలు. తగినభూమి లేనిదే గాలిలో పంటపండించ లేము. అటులనే గ్రామములలో విశ్రాంతిస్థలములు (Resting Places) అనగా మందబయళ్లు లేనిది పశువులు జీవించుట కష్టము. ఈ రహస్యము తెలిసి యుండియే పూర్వము మన పెద్దలు క్రొత్త సాగుకు యిరువుగా క్రొత్తఊరు ఆరంభించే టప్పుడు గ్రామమునకు నాలుగువైపులసాధ్యమైనంత దగ్గరలో సాగుబడినేలకు పరిపోవుపిశాలమున మందబయళ్లు, బీడులునుంచి మిగతా భాగము సాగుచేసికొనెడివారు. పగలంతయు నీటిలో బురదలో ముల్లుకఱ్ఱపోటులతో నాగలి మెడవేసికొని భూమిని ఛేదించి తమకు ధాన్యమిప్పించెడి పశువులు సాయంత్రము

మందబయలు అనేపొడినేలలో విశ్రాంతితీసికొని పచ్చిక తిని కడుపు నింపుకొని, కొంచెముగాలిపీల్చుకొనిన తరువాత వానిని పశుశాల (Cow house)కు తీసికొనివెళ్లేవారు. ఆవులు దూడలు కూడ పగలంతయు గుడకొయ్యలకు, పేడరొచ్చులో కట్టివేయ బడక విశ్రాంతిగా బీళ్లవెంటతిరిగి సాయంకాలము మంద బయళ్ళలో కలసిమెలసి విహరించి తరువాత యిండ్లకు జేరెడివి. గ్రామమునకు పెద్దఅని యుండడము, ఆతనికి పలుకుబడిగౌర వము యుండు దినములలో గ్రామపెద్ద ఊరితండ్రివలె, ఊరి క్షేమం, పశువుల ఆరోగ్యము కాపాడు దినములలో గ్రామ ములో మునసబు కరణాలు ఎవరికివారు ప్రత్యేకపాట్లీలు లేవ తీయక అందరుకలసి గ్రామకట్టుగా మెలగు సమయములలో పశుజీవనాధారమగు మందబయళ్లు చక్కగానుండెడివి.

వర్షాకాలములో పల్లపుగ్రామముల పశువులు స్వేచ్ఛగా నిలచి మేతమేయుటకు ఆరోగ్యకరమగు ఎత్తునేలలు, మంద బయళ్ళుగా జీవకళలవలె గ్రామలక్ష్మిపీఠమువలె, గ్రామనా ధుని కాపుదలక్రింద గ్రామసముదాయస్థలములై విలసిల్లు చుండెడివి. జమీందారీ గ్రామములలోగాని సర్కారు గ్రామ ములలోగాని మందబయళ్ళుగా ఉపయోగపడువరకు వాటిఆధీ నముగ్రామసముదాయముఅందరిదనియు, వాటినిఅక్రమముగా స్వాధీనముచేసికొనుటకు జమీందారులు మొదలుకొని ఎవరికిని స్వాతంత్ర్యములేదనియు జమీందారీలలో శాశ్వతపట్టాలు యిచ్చేటప్పుడుకూడ ఇవి గ్రామసముదాయములక్రింద యుండి పోవలెననియు,ఒకవేళ గ్రామమునకుఅవియన్నియుగాని,అందు

కొన్నిగాని, అవసరమైనయెడలవాటిని సాగుబడిచేయుటకుగాని మరొకపనిచేయుటకుగాని జిల్లాకలెక్టరు (District Collector) ఆజ్ఞ యుండవలెననియు మొదలగు కట్టుదిట్టములుచేసిరి. కాని మానవునిఆశయందుదైవనియామకములేఆగనప్పుడుమనుష్యుని నియామకములాగునా! తలకొకపెత్తనములు,అత్యాశలు,కక్షలు వీటికితోడు పల్లపుభూమిధరలు హెచ్చుట, గ్రామయజమానుల ప్రతిష్ఠ, గౌరవములు సన్నగిలు వేతనపూర్వకములగు ఉద్యోగములగుట మొదలగునవి గ్రామసముదాయభూములను దిక్కులేనివిగ జేసినవి. నోరున్నవారలది రాజ్యమైనది. అనాథలగు పశువులభూములను మొగదిక్కులేనివిగా జేసివేసినవి. మందబయళ్ళు బురదస్థలములక్రిందను, పాయిఖానాలక్రిందను, యిటుకపెంకుగుట్టలకు. మన్నుత్రవ్వుటకుతీసిన గోతులక్రిందను, కొంతభాగము పెరటిస్థలములక్రిందను మారి రూపుమాసిపోయినవి. కొన్ని మందబయళ్ళు జమీందారుల స్వంతకమతములక్రిందకు, జరీబులక్రిందకు మారినవి. గ్రామపంచాయతీలు గ్రామములలో యేర్పడి పలుకుబడి, గౌరవము, అధికారములు శాసనపూర్వకముగానైనను సంపాదించి మందబయళ్ళయందు ప్రత్యేక దీక్షవహించినగాని ఈ స్థితిమారునట్లు కనబడదు. పల్లపుగ్రామములలో పశుగణము నిరాధారమై నిస్సారమై నామమాత్రావశిష్ట మగుచున్నది. దమ్ముచే యు పశువులకు అసలు ఆధారములేక కొన్నిచోట్ల మేతకొరకు వందలకొలది మైళ్ళుపంపవలసివచ్చుచున్నది. రైతుసోదరులు మందబయళ్ళవిషయమున శ్రద్ధవహించి పూర్వము మనకుండెడి పశులక్ష్మిని కాపాడుదురుగాక.

## పశుగ్రాసములు.

పశుజాతుల అభివృద్ధికి పశువులు బలముగలిగి శక్తితో పనిచేయుటకును ముఖ్యముగ మేతవిషయమై శ్రద్ధవహించవలెను. బలకరమగు క్రొత్తక్రొత్త రకముల గడ్డిని పెంచవలెను. ఎండుగడ్డినేగాక బలకరమగు పచ్చిగడ్డిని సయితము నిలువయుంచు పద్ధతులను కనిపెట్టి గడ్డి కఱవగు వేసవి దినములయందు ఉపయోగించవలెను. హాలెండు దేశమున పశువుల విషయమై చాల శ్రద్ధవహించుచున్నారు. వందల ఎకరములుగల ఖండములను పశువులమేతలకై వదలిపెట్టుచున్నారు. హాలెండు దేశము (Holland) నందలి పచ్చిక బయళ్లు హిందూదేశమునందుగల బయళ్లకన్న చాలపెద్దవి. పశువులను బలకరమగు గడ్డితో పుష్టిగా మేపినగాని పశుజాతికి అభివృద్ధికలుగనేరదు. పశువుల మేతవిషయమునను అభివృద్ధిని గూర్చి ఆలోచించునప్పుడు ఈక్రింది విషయములను జ్ఞప్తియందుంచుకొనవలెను.

డిశంబరు మొదలు జూలై మాసమువరకు మన దేశమునం దన్నిప్రాంతములందును మేత బాగుగా దొరకును. ప్రజాభివృద్ధివలన ఎక్కువభూమి సాగుబడిలోనికి తేబడుచున్నందున పచ్చికబీళ్లు తగ్గిపోవుచున్నవి. రెండు సంవత్సరములలో కొన్ని లక్షల ఎకరములు సాగుబడిక్రిందకు వచ్చినవి. ప్రత్యేకముగా పశువులమేతకై జొన్న మొదలగు పైరులు పెంచుటకై వదలివేయబడుచున్నపొలములలో పంటలకై ఉపయోగింపబడవలసిన ఆవశ్యకత హెచ్చుచున్నది.

పైరులను పచ్చిగడ్డిని నిలువజేయుటకు తగిన సదుపాయము లను జేయవలెను. పైరులను పచ్చిగడ్డిని వృధాగా పోనీయక క్లుప్తముగా వాడుకొనవలయును. పచ్చిగడ్డిని గాలి (Air) తీసి వేయబడిన గుంటలయందు నిలువచేయు పద్ధతులను నేర్చుకొన వలెను. ప్రత్తిగింజలు మొదలగుధాన్యములు తదితరములగు చిట్టు తవుడు మొదలగు బలకర పదార్థములను తరచుగ తగినంత ఉప్పుతో చేర్చి పెట్టవలెను. గడ్డి కోయవలసినకాలము మించకుండ కోసి నిలువచేయుటవలన లాభమురాగలదు. సాధారణముగ మన పల్లెటూళ్లలో పశువులమేపుపద్ధతియందు చాల గడ్డి పాడగుచున్నది. దంటుగల జొన్న మొదలగు పైరు లను ముక్కలు ముక్కలుగ నరికి పశువులకు వేసినచో గడ్డి అంతగా నష్టముకాజాలదు. ఇట్లు పారుపోయిన గడ్డి పేడతో కలసి ఎరువుగ నుపయోగపడుచున్నను గడ్డి చాలని పరిస్థితుల యందు, ఇట్లు గడ్డిని వృధాచేయుట పొరబాటు.

పశుగ్రాసముల విషయమై పల్లపుభూములకంటె మెరక భూములయందెక్కువ సౌకర్యములున్నవన్న విషయము ఎంతమాత్రము సాగుబడి జ్ఞానమున్నవారు ఒప్పుకొనక తప్పదు కాని దంపభూములు పూర్తిగా మేత సస్యములకు నిరుపయోగములుకావు. దంపభూములయందు తొలకరిపంట కోసినవెనుక పైరు ఫలమున కాశింపక రైతులు జనుము, పెసర మున్నగునవి చల్లి దానికి నీటినిపెట్టి పెంచి వేసవిలో కొంతవరకు పచ్చిమేతనే మేపుటయు, చాలవరకు దానిని కోసి ఎండబెట్టి గడ్డిని కుప్పలువేసి దాచియుంచి దమ్ముచేయు దిన

ములలోను, ముసురుపట్టిన దినములలోను, తదితర దినముల లోను వానికి వేయుటయు నాచారమై యున్నది. జనుమున కంటె వేరొకపైరు డెల్టాప్రాంతములందు కనుపింపదు. వ్యవసాయశాస్త్రజ్ఞులు (Agriculturist) జనుముగాక తదితర మేత లేవి లాభకరముగ పెరుగునో నిర్ధారణచేసి దెలుపుటవసరము.

## జనుము పండించుట.

జనుము ధాన్యసంబంధమైనపైరు. పశువులకు ఆహారముగను, భూసారము నధికముగ జేయునట్టిదిగను ఇది అత్యంతోపయోగకరమైనది. కొన్నిచోట్ల మనుష్యులకు ఆహారముగ కూడ దీనిపంట ఉపయోగింపబడుచున్నది. కాని మనప్రాంతములలో నీపైరు ఎక్కువగా భూసారము నభివృద్ధి జేయు నిమిత్తముననేగాక కేవలము పశుగ్రాసమునకుకూడ వినియోగింపబడుచున్నది. జనుము ఓషదీగుణముునను ఆకారముునను చాలవరకు ఉలవపైరునే పోలియున్నది. కాని ఇది నిలువుగ 2 నుంచి 4½ అడుగులవరకుబెరిగి శాఖలతో గుబురుగనుండును. జనుపపైరు ఉలవపైరువలెనే యుపయోగింపబడునదైనను దానికన్న అనేకవిధముల ఉత్తమమైనదిగానెన్నబడుచున్నది. జనుము యిసుకనేల మొదలుకొని బంకమట్టివరకు దాదాపు అన్నినేలల యందును పైరగును. ఎక్కువ ఉష్ణప్రదేశములలో నీటిపసదుపాయములుగలఇసుకనేలగాని లేక ఇసుకగలబండునేలగాని దీనికి చాల శ్రేష్టమైనది. ఈపైరునకు అనావృష్టికూడ నేమియు

చెరుపు చేయలేదు. ఎక్కువ తేమగల భూములయందైనను బాగుగా పైరగును. విత్తనముల (Seeds) ను వెదజల్లి పైరు చేయునపుడు సాధారణముగా భూమిని దున్ని పదనుచేయుటయే మంచిపద్ధతి. ఇట్టి సమయములందు ఎరువు వేయదలంచినచో వెంటనే విత్తనములతో సంబంధ మేర్పడనివిధమున ఎరువును భూమితోనే కలుపవలెను. అట్లుగాక గుంటలనుచేసి విత్తనములు నాటుపద్ధతికూడ కలదు. ఈ పద్ధతిని వేయదలచిన ఎరువును గుంటలలోనే వేయవలెను. జనుపపైరునకు ఎరువు వేయవలసిన అవసరమువచ్చినచో ఫాస్ఫేట్ (Phosphate) పొటాష్ (Potash) ను కలిపివేయుటయే మంచిది. నత్రిజని సంబంధమగు ఎరువులుకూడ జనుమునకు మంచి లాభప్రదమైనవేగాని నత్రిజని (Nitrogen) నుపయోగింప దలచినచో నైట్రేట్ ఆఫ్‌సోడా (Nitrate of soda) నుపయోగించుటయే మేలు. చిన్న మొక్కలకైనచో దానినే కొద్దిగా నుపయోగించవలెను.

జనుమును విత్తనములకై పైరువేసినపుడు కోత సమయమున చాల జాగ్రత్తగా గుర్తించవలెను. ఆరంభములో కాయలు పక్వస్థితికి వచ్చినంతనే కోత మొదలుపెట్టి పొలమునంతటిని కోసివేయవలెను. లేనిచో కాయలుచిట్లి గింజలన్నియు రాలిపోవును. పశుగ్రాసమున కుపయోగింప దలచినపుడు మాత్రము జనుపపైరును అంతకు ముందుగనే ఉలవమొక్కలు మున్నగువానిని కోయు స్థితియందే కోసివేయవలెను. జనుములో మంచి సహజ శాకాహారము విశేషముగ నున్నది.

ఇట్టి పదార్థమును గలిగియుండుటలో ప్రత్తిగింజలతో సమా నములని చెప్పవచ్చును. పాడిపశువులను, గుఱ్ఱములను, గొఱ్ఱెలను వీనితో సంతృప్తికరముగ మేపవచ్చును. కాని ప్రత్యేకముగ జనుములనుమాత్రమే పెట్టరాదు. వీనితో నాలుగైదురెట్లు జొన్నలనుగాని తవుడునుగాని చేర్చి ప్రత్తిగింజలు, ఆముదపు గింజలు పెట్టునట్లుగా పెట్టవలెను. జనపకాడయొక్క గుణా గుణములు కావలసిన స్వస్థవృత్తమను గ్రంథము చూడుడు. ముఖ్యముగ గుఱ్ఱములకు, పశువులకు జనుములను రుబ్బి పెట్టు టయే మంచిది. పాడిపశువులకు (Milking Cows) జనుము లను రుబ్బిపెట్టినచో బాగుగా పాలనిచ్చును. ఎక్కువ వెన్న (Butter) ను కలుగజేయును. పాలకును, వెన్నకును, ఎట్టివాసన (Smell) సంక్రమించకపోవుటయేగాక మిగుల ఆరోగ్య కర ముగ నుండును.

## తృణధాన్యములు

పశువులమేతలకు పనికివచ్చు పంట లనేకములుగలవు. పశుగ్రాసమున కుపయోగించుపైరు ఎక్కువ ఒదుగగునట్టిది గను, త్వరలో జీర్ణమగునట్టిదిగను, నోటికి ఇంపైనట్టిదిగను, త్వరలో పెరుగునదిగాను ఉండవలయును. పశువుల ఆహారము నందు నీటిమేత, గడ్డి, చొప్ప మున్నగునవి ప్రధానములు. తృణధాన్యములలో మృదువుగనుండు వరి, గోధుమ, చామ మొదలగువాని దంటునకు గడ్డియనియు, జొన్న, మొక్క జొన్న, కొఱ్ఱ మొదలగు వాని కాండములవలె బిరుసుగ నుండు దంటునకు చొప్పయనియు సామాన్యముగా వాడుదురు. గడ్డి

లోను చొప్పలోను రెండురకములుగలవు. సస్యముఫలించువర కునుంచి వెన్నులు కోసికొనినతరువాతగాని, ధాన్యము నూర్చు కొనినవెనుకగాని దిగబడు గడ్డియు, చొప్పయు నొక విధమైనవి. మేతకొరకే ప్రత్యేకముగా నొత్తుగాచల్లి పెంచి వెన్నులు ముదరకమునుపే గోసి మేతగా నుపయోగింపబడు గడ్డియు చొప్పయు మరియొక విధమైనవి. ఇట్టిమేతను పచ్చిగానున్నప్పుడుగాని, లేక ఎండబెట్టిగాని ఉపయోగింపవచ్చును. గరిక, తొండంగి, గిని, ల్యూసెరిన్ మొదలగు గడ్డిజాతులు పంటలకు పనికిరావు. వీటిని మేతకొరకు పెంచుటగలదు.

## అపరసస్యములు

తృణధాన్యముల దంటెగాక జనుము, ఉలవ, బొబ్బర, అనువు మొదలగు అపరసస్యముల కాడగూడ పశువుల మేతగా నుపయోగించవచ్చును. ఇవియు పెసరమినుము మొదలగునవియు పంటకొరకు పెంచి గింజలుతీసివేయబడినవెనుక దిగబడుపొట్టు గూడ పశువులకు మంచి ఆహారము. ఇదియునుగాక నిద్రిగన్నేరుమున్నగు కొన్నికొన్ని చెట్లరొట్టగూడ పశువుల మేతగా నుపయోగించును. ఏమియు దొరకనపుడు పశువులు తాటియాకులను వేపాకులును గూడ తిని పొట్టపోసికొనును.

## జొన్నపైరే శ్రేష్టమైనది

మన దేశములో పశుగ్రాసములకు పనికివచ్చు పైరులలో జొన్నయే శ్రేష్టమైనది. ఇది ఎండిన తరువాత పశువులకు పెట్టు అలవాటు సాధారణముగాగలదు. దీనినే మనము

చొప్ప యని వాడుదుము. కొన్ని సమయములందు పచ్చి మీద, అనగా పుష్పించి పాలపొట్టపై నున్నపుడు మేపుట గలదు. కొన్ని సమయములందు పుష్పించుటకు ముందుగా పచ్చిమీద జొన్న మేపినయెడల విషముగా మారి పశువును చంపును. ఈ విషయము తెలిసికొనవలెననినచో "విషతంత్రము" అను గ్రంథము చూడుడు. ఈ జొన్నలలో తెల్ల జొన్న, పచ్చజొన్న మొదలగు జాతులనేకములు గలవు. ఈ రకముల నన్నిటిని సాధారణముగా తొలకరిని వేయుదురు. కొన్ని శీతాకాలములో సెప్టెంబరు, అక్టోబరు నెలలలో వేసి ఫిబ్రవరి నెలలో కోయు రకములుగూడ గలవు. కొన్ని రకములు వేసవికాలము (Summer) లో నీటి ఆధారమున సేద్యము జేయునవి యైయున్నవి. రైతు జాగ్రత్తగా యుక్తాయుక్తములు విచారించి వ్యవసాయము జేసిన మొత్తముమీద సంవత్సరము పొడుగున జొన్నపైరు వేయవచ్చును.

పశుగ్రాసమునకు పనికివచ్చు జొన్నకు బాగుగా ఇంకిపోవు గరపనేలలు మంచివి. తొలకరిలోనే శుభ్రముగా రెండు మూడు సార్లు దున్ని, జూన్ నెలలో ఒకవర్షము కురిసిన తరువాత విత్తనములు వెదజల్లుటగాని లేక గొర్రులో వేయుటగాని మంచిది. ఎకరమునకు 20 నుంచి 40 పౌనులవరకు విత్తనములు జల్లవచ్చును. ఆరుదలమీద ఒకటి రెండు పర్యాయములు కలుపుతీసి కొంచెము పై పాటుపెట్టి పుష్పించే సమయమునందు కోయుట మంచిది. ఎకరమునకు 15 బండ్లు బాగుగా చీకిన పశువులపెంట (Cattle dung) వేసి 150 లేక 200 పౌ

నలు నైట్రేట్ ఆఫ్ సోడా (Nitrate of soda) తో రెండు పర్యాయములు సత్తువజేసినచో 15 వేల పౌనులవరకు పచ్చి మేత అనగా 5 లేక 6 వేల పౌనుల ఎండు చొప్పకు సరిపోవు పైరు ఫలించును.

## మొక్కజొన్న.

ప్రపంచములోని పశ్వాహారములలో జొన్నచొప్పతరువాత మొక్కజొన్న చొప్ప (Maize Fodder) ఒకటి చాల ముఖ్యమైనది. జొన్నవలెనే ఇదియు బాగుగా పెరిగి మంచిప్రశస్తమైన పశ్వాహారమొసగును. మరియు నీపైరు పెరుగుకాలములో, నేతరుణమందైనను పశువులను నిరభ్యంతరముగ మేపవచ్చును. దానివలన నెట్టి చెరుపునులేదు. ప్రపంచములోని కెల్ల అమెరికా సంయుక్త రాష్ట్రములలో మొక్కజొన్నపైరు చాలవృద్ధిలోనికి తీసికొని రాబడెను. ఇచ్చట పశ్వాహారము కొరకును,ధాన్యముకొరకునుగూడదీనికి విశేషముగా వేయుదురు. అచ్చట మొక్కజొన్నముఖ్యమైనదిగా పరిగణింపబడుచున్నది. కండెలనుకోసివేసినపిమ్మట మొక్కలను పచ్చిఆహారముగ పెట్టవచ్చును. మొక్క లెదిగి కంకివేసినతరువాత కోయుదురు. ఈ మొక్కలను పశువులు యిష్టముతో దినును. ఇది మధురము (Sweet) గా నుండుటయే దీనికికారణము. పచ్చిగానున్నప్పుడుగాని ఎండించిగాని దీనిని పశువులకు మేపవచ్చును. ఒకఎకరమునకు 20 వేలపౌనుల పచ్చిఆహారము లభించును. ఈఆహారములో బలమును కలుగజేసెడి వస్తువులెక్కువగా నున్నవి. అందువలన పాడిపశువులకు, వాతరోగములుగల పశువులకు తగినంతగా

మేపుచు సాయంకాలములందు తెలికపిండి (Oil cake) తగినంతగా పెట్టుటమంచిది. దుక్కి పశువులకుగూడ తగినంతగా మేపవలెను. ఎక్కువగా మేపినయెడల నేత్రవాతరోగములు సంభవించును.

## తృణధాన్యములలోనుండు భాగములు.

సామాన్యముగా రైతులచే సాగుచేయబడు సస్యములలో తృణధాన్యములు ఎక్కువవిస్తీర్ణము నాక్రమించుటచే కృషీవలునకు వీని గడ్డియు చొప్పయు విశేషముగా లభించుచుండును. కావున పశువులమేతలో ప్రధానభాగమనియే చెప్పవచ్చును. వీనిలో రమారమి సగము నూటికి 9 పాళ్లు తేమయు, 2 పాళ్లు మాంసకృత్తులు, 15 పాళ్లు ద్రావణీయకర్బనోజ్జనితములు, 32 పాళ్లు నారపదార్థములు రెండుపాళ్లు చమురు పదార్థములు, 20 పాళ్లు బూడిదపదార్థములు నుండును. తృణధాన్యములదంటునందుండు చమురంతయు నిజమైన చమురుగాదు. చాలభాగము ఒకవిధమైన మైనమువంటి ద్రవ్యము. ఇది ఆహారయోగ్యము కాదు. ఖనిజద్రవ్యములలోగూడ చాలభాగము యిసుకయు ఇతర ద్రావణీయశైలితములును యున్నవి.

# తృణధాన్యములగడ్డియొక్కయు చొప్పయొక్కయు వ్యత్యాసములు.

| | తేమ | మాంసకృత్తులు | పిండిపదార్థములు | నారపదార్థములు | చమురు | ఖనిజద్రవ్యములు |
|---|---|---|---|---|---|---|
| వరిగడ్డి | 8.12 | 1.78 | 40.65 | 30.02 | 2.19 | 16.87 |
| జొన్న చొప్ప | 8.06 | 1.61 | 49.18 | 30.93 | 3.14 | 7.08 |
| గంటెచొప్ప | 7.07 | 1.94 | 43.99 | 37.63 | 1.33 | 8.04 |
| ఆరిక చొప్ప | 8.71 | 1.97 | 47.92 | 28.84 | 2.51 | 10.05 |
| చోడిగడ్డి | 9.88 | 2.19 | 45.24 | 28.22 | 2.37 | 12.10 |
| గోధుమగడ్డి | 8.78 | 3.45 | 37.33 | 44.99 | 1.29 | 4.16 |
| మొక్క-జొన్నచొప్ప | 9.57 | 5.02 | 49 11 | 29.97 | 1.10 | 5.23 |

పై వానిలో మొక్కజొన్నచొప్పలోను, గోధుమగడ్డిలోను, మాంసకృత్తు లెక్కువగానుండును. కాని గోధుమగడ్డిలో ద్రావణీయకర్బనోజ్జనితములు మిగుల తక్కువ. ఈ ద్రవ్యములు జొన్నయందును, మొక్కజొన్నయందును, విస్తారముగా గలవు. ఖనిజద్రవ్యములలోను వరిగడ్డిలోను మిగుల నెక్కువగాగలవు. ఇందు చాలభాగము శరీరపోషణకు పనికిరాని యిసుకయు శైలితములునేయై యున్నవి. ఖనిజద్రవ్యములు గోధుమగడ్డిలోను మొక్కజొన్నచొప్పలోను మిగులతక్కువ. నారపదార్థములు గోధుమగడ్డిలో విస్తారముగాగలవు. పైనచెప్పబడినగడ్డిజాతులయందును చొప్పలోను గల ద్రవ్యముల పరిమితినంతయు పశువులు జీర్ణముచేసికొనజాలవు. సామాన్యముగ మనరాజధానిలో ముఖ్యముగ వరిపండు జిల్లాలలో వరిగడ్డియే పశువులకు ముఖ్యాధారమైయున్నది.

ఇది మృదువుగనుండుటచేత నిది తిని బ్రతుకు పశువులంత బలిష్టములుగనుండవు. ఉత్తరహిందూస్థాన మండలి అమృతసరస్సు జిల్లాలలో చుట్టుప్రక్కలను వరిగడ్డి కరవుకాలములోనే తప్ప పశువులమేతగా నుపయోగింపరట. ఎల్లప్పుడును బలమైన యితరాహారములు దినుటచేతనే అచ్చటిపశువులు సామాన్యముగా బలిష్టముగా నుండును. మృదువగుదంటు ధాన్యపుజాతులలో ఆరికగడ్డి కూడ చాలముఖ్యమైనది. దీనిని, గడ్డినిగూడ పశువులు బాగుగా యిష్టముతో దినును. ఆరికగడ్డి కూడ కొంతవరకు మెత్తగనేయున్నను పశువులంతగా యిష్టపడవు. గోధుమగడ్డియు చోడిగడ్డియు గూడ పశువులంతగా

దినవు. చొప్పలలో జొన్నచొప్పయు, మొక్కజొన్నచొప్పయు ప్రశస్తములైనవి. గంటెచొప్పయు, కొఱ్ఱచొప్పయు అంత ప్రశస్తములుగావు.

## పచ్చిమేతకు ఎండుమేతకు తారతమ్యము.

పశువులు ఎండుమేతకంటె పచ్చిమేతకు ఎక్కువ యిష్ట పడును. పచ్చిమేతలో నీ రెక్కువగా యుండుటచే మృదువుగ నుండును. రుచియు పశువులస్వాభావికాహారమగు పచ్చికరుచిని పోలియుండును. సులభముగ జీర్ణమగును. పచ్చిమేతకును ఎండు మేతకును తారతమ్యము (Difference) గలదు. పచ్చిమేతల యందు తదితరమేతలకంటె మాంసకృత్తుపదార్థము లెక్కువగ నుండుటచేతను, త్వరలో జీర్ణమగుటచేతను, ఇది ఎక్కువైనదిగ పరిగణింపబడుచున్నది. ఎక్కువవర్షము కురియు జిల్లాలలో నీపచ్చిమేతను ఎండించి ముందుపయోగము నిమిత్తము నిలువ చేయవచ్చును. ఈ మేత పచ్చిమేత లభించని వేసవికాలము నందు ఉపయోగించుట మంచిది. ఈ గడ్డియందలి తేమ ఇగిరి పోవుటచే బరువు నూటికి 370 నుంచి 380 వరకు తగ్గును.

| | తేమ | మాంస కృత్తులు | ద్రావణీయకర్బనోజనితములు | నారపదార్థము | చమురు పదార్థము | ఖనిజద్రవ్యములు |
|---|---|---|---|---|---|---|
| జొన్నచొప్ప పచ్చిది | 69.52 | 1.36 | 14.81 | 10.85 | .48 | 1.56 |
| ,, ఎండుది | 10.00 | 4.01 | 43.69 | 30.83 | 1.41 | 1.60 |
| చోడిగడ్డి పచ్చిది | 80.83 | 1.94 | 7.84 | 5.38 | 48 | 3.53 |
| ,, ఎండుది | 10.10 | 9.11 | 36.86 | 25.26 | 2.25 | 19.52 |
| మొక్కజొన్న పచ్చిది | 88 92 | 1.13 | 4.65 | 3.11 | .31 | 1.88 |
| ,, ఎండుది | 10.00 | 9.17 | 37.76 | 25.25 | 2.52 | 10.26 |

సామాన్యముగ పచ్చిచొప్పనుగాని, గడ్డినిగాని ఎండించినయెడల ఇందలి తేమ ఇగిరిపోవుటచే బరువు నూటికి 370 నుంచి 380 వరకు తగ్గును.

పంటపండించి కోసినప్పుడు దిగబడుదంటుయొక్క పృధిక్కరణము మాంసకృత్తులలో నూటికి 25 నుంచి 35 వరకును ద్రావణీయ కర్బనోజ్జనితములలో 40 నుంచి 60 వరకును, నారపదార్థములందు 50 నుంచి 60 వరకును, చమురు పదార్థములలో నూటికి 30 నుంచి 40 వరకు జీర్ణముకాదగిన భాగము లుండునని కొన్నిప్రయోగములచే పాశ్చాత్యశాస్త్రజ్ఞులు (Western Scientists) కనిపెట్టిరి. మన దేశములోనిట్టిప్రయోగమునింకను ప్రారంభింపలేదు. మొత్తముమీద లెక్కవేసిన యెడలజంతువులచేత జీర్ణముచేసికొనదగిన ద్రవ్యములు మొక్కజొన్న చొప్పలోను, జొన్నచొప్పలోను తక్కినవానిలోకంటె ఎక్కువగా నున్నవి. గోధుమగడ్డిలో కూడ చాల తక్కువ. ప్రత్యేకముగా మేతకొరకు పెంచి వెన్నుముదరకముందు గోసి ఎండించిన దంటునందు మాంసకృత్తులు ఎక్కువగా నుండుటచే నిది ఎక్కువబలమైనది.

| | మాంసకృత్తులు |
|---|---|
| జొన్నచొప్పపంటతీసినది | 1.61% |
| మేతకొరకు పెంచినది | 4.00% |
| మొక్కజొన్న పంట తీసినది | 5.02% |
| మేతకొరకు పెంచినది | 9.17% |

మేతకొరకు ప్రత్యేకముగా పెంచు చొప్పలో మాంస కృత్తులు విశేషముగా నుండుటకు కారణము గింజలలోనికి బోవుసారము దంటునందే నిలిచియుండుటయే. ఇట్టి వానికి మిగుల బలముచేయును. కావున పశువుల యభివృద్ధిగోరువారు పశుమేత కొరకు జొన్న మొదలగు వానిని బెంచుట మంచిది. ఒంగోలు ప్రాంతములయందు జొన్నపంట విస్తారముగా నుండుటయు, వర్షములు తరచుగా లేని కారణమువలన వెన్ను ముదర వీలులేనపుడెల్ల కోసి పశువులకు పెట్టుచువచ్చుటవలన ఒంగోలు జాతి పశువులయొక్క అభివృద్ధికి గారణములని చెప్పవచ్చును.

## బొమ్మజెముడు

కరవుసమయములలో పశువులకు మేపుటకు నెక్కువ ధనవ్యయము కానట్టియు, వాని కనుకూలముగ నుండునట్టియు ఆహారము నొకదానిని కనుగొనుటకు ప్రయత్నింప బడు చుండెను. ఈవిషయములో ననేక ప్రయత్నములు సలుప బడెను. కాని యింతవరకు ఈ విషయము నిర్థారణ కాలేదు. మనదేశమునం దంతటను అడవివలె పెరుగు బొమ్మజెముడు పశ్వాహారముగ ప్రయత్నించి చూడవలెనని యిటీవల గొన్ని సంవత్సరములనుండి కొందరికి యుద్దేశము కలిగెను. అట్లుప్రయ త్నించి చూడగ ఇది యుపయోగకరమైన ఆహారమని అనేక ప్రదేశములనుండి తెలియవచ్చెను. దీనిని మిక్కిలి తేలికగా పెంచవచ్చును గాని ఒకవిధమైన పురుగులు (A kind of insects) బయలు దేరి ఈజెముడునంతను నాశన మొనర్చినవి.

సామాన్య బొమ్మజెముడు పశువులకు పెట్టునపుడు వానిముండ్లను దీసివైచి పెట్టవలయును.

ముళ్ళను తీసివైచినపిమ్మట మట్టలను చిన్నముక్కలుగ గొట్టి వానిని ప్రత్యేకముగగాని, ఇతరపదార్థములతో గాని కలిపిపెట్టవచ్చును. ముళ్ళను మొదలంట దీసివేయకుండ పశువులకు పెట్టినచో అట్టిఆహారము పశువులకు ప్రమాదము కలిగించును. మట్టలకుండు నూగునుకూడ తొలగించవలెను. ముల్లునోటిలోగుచ్చుకొనుటచే మిగులబాధజెందును. ఇంతియగాకుండ ముల్లుఆహారముతో కలిసి కడుపులోనికి పోయినను హానికరమైయున్నది. కడుపులోని ప్రేగులకవి గుచ్చుకొని విరేచనములు(Motions) మున్నగువ్యాధులుకలుగును. ముళ్లలో విషముకూడ నుండును. కనుక హానికరములని చెప్పుట కేమియు సందియములేదు.

## పెంపుడు ప్రదేశములు

కొంతకాలమునుండి పరిశోధనలు సలిపి తత్ఫలితముగ ముల్లులేని బొమ్మజెముడు ఒకటి సృష్టింపబడినది. ఈమట్టలకేమాత్రమును ముల్లుండక మృదువుగనుండును. ఈజాతిని సులువుగా పెంచవచ్చును. మెరక భూములందపరిమితముగా పెరుగును. ఇది పశువులకు చౌకయైన ఆహారము. దీనిని పెట్టుటవలన పశువుల కెట్టిహానియులేదు. ముల్లులేని మట్టలను పరిశోధించివానియందేయేపదార్థము లెన్నిన్నిపాళ్లుండునదియు కోయంబత్తూరు వ్యవసాయ కళాశాలవారు కనుగొనిరి.

| | |
|---|---|
| నీరు | 21.82 |
| కరిగిపోగల లోహపదార్థము | 6.82 |
| కరగనిలోహపదార్థము | 0.07 |
| నూనె పదార్థము | 0.91 |
| కఱ్ఱ సంబంధమైననార | 6.20 |
| క్రూడ్ ప్రోటీడ్ | 3.35 |
| పిండి పదార్థములు | 60.83 |
| | 100-00 |

పైపదార్థములలో నీరుతక్కువగా నుండుటకు గారణము ఈపరిశోధనలు జరిగినప్పుడు మట్టలుఆరిపోయి యుండుట యని తెలియుచున్నది.

## పిండులను తయారు చేయుట

చమురుగింజలనుండి నూనెను తయారుచేయగా మిగిలిన పిప్పినే పిండి (Cake) యందురు. ఈపిండి పశువులకు మేతగను, పొలములకు ఎరువుగను నుపయోగించెదరు. కొంత నూనె ఈ పిండులలో కలసియుండును. గానుగ ననుసరించి ఎంత నూనె యుండునది తెలియును. ఇనుపయంత్రముల గానుగలలో మాత్రముండు పిండులలో నూనె ఎంత మాత్రముయుండదు. కొన్నిరకముల పిండులను మాత్రమే పశువులుతినును. నువ్వులు, ప్రత్తివిత్తులు, ఎఱ్ఱగిసె, ఆవ, కుసుమ, వేరుశనగ, కొబ్బరి, మొదలగువాటి పిండులు పశువులు మిగుల ప్రీతితో తినును.

ఆముదము, బొప్పాయి,మహువాపిండినిమాత్రము తినజాలవు. ఏయే పిండినిఎరువుగా నుపయోగించునది వాటివెలల ననుసరించి యుండును. కొన్నిటిని పశువులు తినినందువలన వెల (Cost) సరసమగునని తలంచరాదు. కొన్నిప్రదేశములలో పశువుల ఆహారమున కుపయోగపడునవి చాలస్వల్పధరలకు లభించును. అట్టి సందర్భములలో వాటినే ఎరువులుగా నుపయోగించ వలెను.

పశువుల కుపయోగించని ఆముదపుపిండి తినుట కుప యోగించు వానికంటె వెలఎక్కువ. ప్రతిరైతును ఏదిచౌకగా లభించునో ఆలోచించుకొనవలెను. పశువులకు దగిన పిండిని మేపి వాటి మలమూత్రములు (Urine and dung) భూము లకు వినియోగించినయెడల రెండువిధముల లాభములుండును. పశువులకు మేపినందువలన వాటిలోని వృక్షాహారపదార్థములు నశింపవు. అవన్నియు మలమూత్రములలోనే యుండును. కాని మలమూత్రములు పదిలముచేయుటయందు జాగ్రత్త లేని యెడల నష్టమగును. చెరకు మొదలగు విలువగల సస్యములను పైరు చేయుకోరువారు పశువులకు తెలికపిండి (Oil Cake) మేపి వాటిని పొలములోనే రాత్రియందు కట్టివేసిన యెడల నష్టముండదు. మేతకుండవలసిన ధర్మములకును ఎరువున కుండ వలసిన గుణములకును చాలవ్యత్యాసము గలదు. తేమ, నార, మాంసకృత్తులు, ద్రావణీయమైన సేంద్రియపదార్థము మొద లగు వస్తువులన్నియు మేతకుపయోగపడెడు పిండులలో నుండ వలెను. ఈకారణములవలన మేతకుపయోగపడనిపిండి ఎరువుల కుపయోగపడుపదార్థము లెక్కువగా నుండును.

## ప్రత్తిగింజలు

ఈ గింజలు పాడిపశువుల కాహారముగ వాడబడు చున్నవి. ఈ గింజలపైన కొంచెము ప్రత్తియంటియుండును. ఈ ప్రత్తియు, గింజల పై పొట్టును జీర్ణముగావు. ప్రత్తిగింజల యందు తగినంతచమురున్న నే గాని పశువులకు బెట్టినపుడు జీర్ణముకాదు. ప్రత్తి పండు జిల్లాలలో గింజలు చౌకగదొర కును. ఈ గింజలను చితుకగొట్టి ఎరువుగవేసిన తగినంత ఫలి తము బొందవచ్చును. ఎక్కువ కాలము నిలువయున్న యెడల ప్రత్తిగింజలు పశ్వాహారమునకు పనికిరావు. అప్పుడు గింజలు చౌకయగును. గనుక వీటిని ఎరువునకు బనికిరావని తలంప రాదు. ఎరువునకు చమురు ఆరిపోయిన గింజలే శ్రేష్టము. చమురున్నగింజల నెరువుగా నుపయోగించినప్పుడు త్వరితఫలి తము గాన్పించదు. ప్రత్తిగింజలయందు చమురు తక్కువగా నుండుటచేత చమురును దీయుట కీదేశమున ప్రయత్నింప బడుటలేదు.

## ప్రత్తిగింజల నూనె

అమెరికాదేశపు ప్రత్తివిత్తులనుండియు, ఈజిప్టు(Egypt) దేశపుప్రత్తివిత్తులనుండియు గానుగల మూలమున చమురు తీయబడుచున్నది. ఈ చమురు కూరలలో తాళింపులు వేసి కొనుటకును, వెన్న చేయుటకును, చేపలుమున్నగు ఆహారపదా ర్థములు నిలువచేసికొనుటకును ఉపయోగింపబడుచున్నది. మన దేశపుప్రత్తివిత్తుల చమురు వగరు రుచిగలిగి గోధుమరంగుతో నుండుటచే దీనినెగుమతి నంతగా నుపయోగించుటలేదు. ప్రత్తి

నూనె కొంచెము పసుపురంగు (Yellow Colour) గలిగి రుచిగానుండును. ఈ నూనె పశువుల చర్మవ్యాధుల (Skin diseases) కు వాడవచ్చును.

## ప్రత్తిపిండి

| | | | |
|---|---|---|---|
| ఈపిండిలో 10 వేలపాళ్లలో | 950 | పాళ్ల | నీరు |
| | 1575 | ,, | మాంసకృత్తులు |
| | 3274 | ,, | ఉష్ణకర పదార్థములు |
| | 2035 | ,, | నార |
| | 376 | ,, | లవణపదార్థములు |
| | 1790 | ,, | నికరవస్తువులు |

ఉండును. గింజలపై పొట్టునుదీసి శుభ్రము చేయకుండ సిద్ధము చేయబడిన పిండిలో నూటికి 3.4 భాగములు నత్రజని (Nitrogen)యు 1.26 భాగముల భాస్వరము (Phosphorus) యుండును. ఈపిండి పెట్టబడిన పాలలో క్రొవ్వుపదార్థములు (Fats) ఎక్కువగాయుండును. దానివలన వెన్నయెక్కువై పూర్వముకంటె నెక్కువ జిడ్డుగను గట్టిగను యుండును. నేయి గూడ గట్టిగ ముద్దగనుండును. ప్రత్తిగింజల పదార్థము పశువులకు పెట్టుచున్నంతకాలము ఈరీతిగా నుండును. పిండినిగాని గింజలనుగాని అధికముగ పెట్టరాదు. గింజలలో చమురుఎక్కువగా నుండుటవలన పిండినే పెట్టుటమంచిది. ప్రతిదినము యితరాహార పదార్థములతో పిండిని జేర్చిపెట్టుటవలన పశువులకు బలము నిచ్చుటయేగాక వెన్నయు పాలును వృద్ధియై

చాలమంచి గుణములు కలుగును. ప్రత్తిపిండివలన వెన్నవలె పాలంతగా వృద్ధియైనటుల కానరావు.

## వేరుశనగపిండి

బొంబాయి, మదరాసు రాజధానులలో పప్పుకొరకును నూనెకొఱకును విశేషముగా పైరుచేయుచున్నారు. వేరుశనగ పరదేశములనుండి ఎన్నియో శతాబ్దము (Century) ల క్రిందట మన దేశమునకు తేబడినది. చీనా, మనిల్లా, అరేబియా దేశములనుండి తేబడినట్లు తెలియుచున్నది. వీటి జన్మభూమి బ్రెజిల్ (Brezil) దేశము. ఇది అయిదారునెలలపంట. పంట తీరగనే పైపచ్చితీగనుకోసి ఎండవేసినచో పశువుల మేతకు పనికివచ్చును.

నూరుపాళ్ల వేరుశనగపిండిలో 13. 41 చమురు
49. 48 మాంసకృత్తులు
22. 5 ఉష్ణకర పదార్థములు

గలవు. మాంసకర పదార్థములలో 80 పాళ్లు మాత్రమే జీర్ణమగును. కాబట్టి జీర్ణకర పదార్థములు 39.58, జీర్ణకరమగు ఉష్ణకరపదార్థములు 16.9, జీర్ణమగుచమురు 12.06. జీర్ణమగు చమురును 2 3 చే గుణించి జీర్ణమగు ఉష్ణకరపదార్థములతో గలిపివేయవలెను. అందువలన జీర్ణమగు చమురు విలువ 44.63 యుండును. కాబట్టి వేరుశనగపిండిలో నూరుపాళ్లలో 39.58 మాంసకృత్తులు, 44 63 ఉష్ణకరపదార్థములును జీర్ణమగును. అనగా సుమారు 1.25 అగును. కాబట్టి ఇది మిక్కిలి బలకర

మైనది. దీనిలో ఉష్ణకరపదార్థములున్నవి. పాడిపశువులకు దినమునకు చిన్నదూడలకు ఒక అరపౌనున్ను పాడిపశువులకు 4 లేక 5 పౌనులును పెట్టిన బాగుగా పాలనిచ్చును, వెన్నయగును. పెట్టిన తరువాత ఒక ఔన్సు ఉప్పు (Salt) పెట్టవలెను. ఇప్పుడిప్పుడే రైతులలో చాలమంది దీనిని వాడుచున్నారు. వ్యవసాయ డిపార్టుమెంటు (Agricultural Department) వారు ఈవిషయమై బాగుగా ప్రచారము చేయుచున్నారు.

## తెలకపిండి

దీనిపంట మనదేశమునందంతటను యున్నది. కాని బొంబాయి చెన్నరాజధానులయందు, బర్మామధ్యపరగణాలయందు విస్తారముగా పైరగుచున్నది. నువ్వులవలన దీయుచమురు మానవులకు పశువులకు ఆహారమునకేగాక మందులలోనికి గూడ పనికివచ్చును. తెలకపిండి (Oil Cake) పాడిపశువులకును, తదితర పశువులకును మంచి ఆహారమైయున్నది. వాతముగల పశువునకు దినమునకు ఒకవీసెడు వంతున ఈయవలెను. నిక్కాకపశువులకు అంతగా వాడరాదు. పశువు శీతములోనున్నప్పుడు తెలికపిండి పెట్టుట మంచిది. వాతసంబంధమగు రోగములు సంభవించినపుడు ఈ పిండిని అప్పుడప్పుడు పెట్టుట మంచిది. నిండుచూలుతో నున్నప్పుడు దీనినెక్కువగా వాడినయెడల పిండము (Koetus) ఈగిపోవును. పశువు ఈనినతరువాత బాగుగా పెట్టవచ్చును. దుక్కిటెద్దులకు సాయంకాలముపూట పెట్టవలెను. గానుగ ఆడినవెంటనే

పిండి తెచ్చిపెట్టిన మిగులబలము గలిగించును. నిలువయున్న పిండి అంత శ్రేష్టమైనదికాదు.

ఈపిండిలో 10 వేల పాళ్ళలో 1080 పాళ్లనీరు
3175 ,, మాంసకృత్తులు
2900 ,, ఉష్ణకరపదార్థములు
365 ,, నారపదార్థములు
1140 ,, లవణపదార్థములు
1340 ,, తదితర వస్తువులు

యుండును. పిండులన్నిటిలో తెలికపిండి మిక్కిలి సారవంతమైనది. ఈ పిండినిగురించి ఆయుర్వేదపశువైద్యవస్తుగుణదీపికలో తేటతెల్లముగా తెలుపబడినది.

## కొబ్బరిపిండి

కొబ్బరికాయలను (Coconut fruits) చిప్పలుగ గోసి ఎండబెట్టి చమురుదీయుదురు. చమురుదీయగా మిగిలిన పిండి పాడిపశువులకు ఆహారముగా నుపయోగపడుచున్నది.

ఈపిండిలో నూటికి 9.00 పాళ్లు నీరు
19.35 ,, పిప్పి
48.00 ,, పిండిపదార్థములు
9.12 ,, కొవ్వు
8.64 ,, నారపదార్థములు
5.89 ,, బూగ్గుపదార్థములు

యుండునని తెలియుచున్నది. ఆరంభములో ఈపిండిని పశువు లంతగా తినవు. అలవాటుచేసినకొలది దినమునకు 7½ పౌనుల కొబ్బరిపిండి (Coconut cake) ని తినునట్లు చేయవచ్చును.

## సోయబీనుపిండి

సోయబీనుగింజలనుండి నూనె తీసివేయబడిన తరువాత దీనిని సోయబీనుపిండి అందురు. సోయబీను తూర్పు దేశముల యందు విశేషముగా పండించుదురు. ఈ గింజలే పశువులకు ఆహారముగ నుపయోగపడుచున్నవి. కాని చాలభాగమువరకు నూనె తీసివేయబడిన పిండిలో యింకను కొంతచమురు యుండును. ఈపిండియందు నూటికి 40 నుంచి 45 వరకు పిండిపదార్థములును, 8 పాళ్ళనూనెయు నుండును. ఇది ప్రత్తిపిండిని పోలి యుండును. ఇతర ఆహారములతో దీనిని కలిపి పెట్టవలెను. ఈ గింజలనుండి పాలు తయారు చేయువచ్చును. గాంధిగారు కూడ ఈపిండి మానవులకు కూడ మంచి ఆహారమని ఇదివరకు తెలిపియున్నారు.

## ల్యూసరను

ఈ గడ్డి నూరుసంవత్సరములనుండి మన దేశములో వ్యాపించుచున్నది. మూడునాలుగువందల సంవత్సరముల క్రిందట ఇది ఐరోపాలోని గ్రీస్ (Greece) దేశమునకు తీసికొని రాబడినది. అచ్చటనుండి ఇటలీ దేశమువరకును, తరువాత స్పెయిన్(Spain) దేశమువరకు నిది వ్యాపించి ఇప్పుడు ఐరోపా (Europe) ఖండమంతటిలోను విరివిగా పైరుచేయబడుచున్నది.

స్పానీయులు మెక్సికో (Mexico) ను జయించినప్పు డది యా దేశమునకు గొని తేబడినది. ఇప్పుడది అమెరికాలో విశేష ముగా పశువులకు వేసి పెంచబడుచున్నది.

ల్యూసరను కాయలో అయిదు ఎనిమిది గింజలవర కుండును. ఈ మొక్క సన్నముగను, పొడవుగను, కొమ్మలు గలదిగను, నునుపుగను యుండును. ఒక్కొక్క మొక్క పది సంవత్సరములు బ్రతుకగలదు. మూడడుగుల ఎత్తు పెరుగగనే మొక్కను కోసివేయవచ్చును. అప్పు డది మరల చిగుర్చును. మంచి పొలములో ఎకరమునకు సంవత్సరమునకు 3 టన్నుల గడ్డి సామాన్యముగా వచ్చును. మన దేశములో ఈ మొక్క అయిదారు సంవత్సరములకంటె నధికముగా బ్రతుకదు. సంవ త్సరమునకు 8 కోతలు కోయవచ్చును. దీని వేళ్లు భూమిలోనికి లోతుగాబోవును. సామాన్యముగా నాలుగుగజముల లోతు వరకు వ్యాపించును. కాని కొన్ని ప్రదేశములలో 193 అడు గులున్నమరికొన్నిచోట్ల 22 గజములలోతువరకును దీని వేళ్లు వ్యాపించినవి. నీటి సదుపాయములున్నచో ఉష్ణదేశములే ఈపైరునకు మంచివి. ఈమొక్కను తలత్రుంచినయెడల విశే షముగా దుబ్బుకట్టి ఎక్కువగా గడ్డినిచ్చును. కొన్ని మొక్క లను తలత్రుంచినయెడల కొమ్మలు హెచ్చును.

## ల్యూసరను బలముగలగడ్డి

నీరునిలువని భూములన్నిటిలో నీరు కట్టవలసిన యావ శ్యకతలేకయే ల్యూసరను గడ్డి పెంచవచ్చునను సంగతి చాల

మందికి తెలియదు. అమెరికాలో వర్షములు కురియునట్టి ప్రదేశములలోగూడ నీరుపెట్టకుండగనే దీనిని బెంచుచున్నారు. 1915 సంవత్సరమునందు శరత్కాలమున కాన్పూరు (Kanpur) నందు పరీక్షనిమిత్తమై ఒకమడిని సిద్ధముచేసి అందులో ఈ గడ్డివేయబడెను. ఈపరిశోధన మిక్కిలి జయప్రదముగా నెరవేరెను. తరువాత అంబాల, కర్నాలీ అనుచోట్ల నీప్రైరువేయబడెను. అంబాలలో నీప్రైరు బాగుగా పెరిగెను. ఈపరిశోధనలను బట్టి దీనికి నీరుకట్టనక్కరలేకుండగనే చాలచోట్ల బెంచవచ్చునని తెలియుచున్నది. నీరుపెట్టించినదానికంటె నీరుకట్టకుండ పెంచినది నెమ్మదిగ పెరిగినను,సరిగను నిరాటంకముగను పెరుగును. నీరు కట్టకుండ పెంచినగడ్డి వర్షాకాలమున వర్షధాటికాగగలదు. కారణమేమన నీరు పెట్టి పెంచినదగుటవలన ఇదివరకే భూమి మిగుల తేమగలిగియుండును. అట్టితరుణమున వర్షముల ధాటి ఎక్కువయ్యెనేని నీరునిలచి నష్టము సంభవించును. అనగా తెగులుపట్టి పెరుగుట ఆగిపోవును. నీరుకట్టబడి పెంచబడు ల్యూసరను సయితము యిట్టియిబ్బంది లేకుండ నాకేవిధముగ బెరుగుచుండును. ఈగడ్డివలన తక్కినవానికంటె నెక్కువలాభములుగలవు. నీరు కట్టనవసరముండదు. పశువులకు పచ్చిమేత కరవుగానుండు దినములలో అనగా జనవరి మొదలు జూన్ వరకు ఇది బాగుగా పెరిగి పశువులకుమంచి ఆహారమగును. మిక్కిలి బలమునిచ్చు ఈగడ్డిని 12 మాసములు పెట్టినయెడల తక్కిన ఆహారములు పెట్టినవానికంటె ఎక్కువగా బలియును. పశువుల బరువులనుపోల్చిచూచిన ఎంతబలిసినదియు తెలియగలదు.

## గడ్డియొక్క పరిమాణము.

ఒకసారివేసినయెడల రెండుమూడు సంవత్సరములవరకు తిరిగి భూమినిసిద్ధముచేయనవసరములేదు. దీనివలన వ్యయప్రయాసలుతగ్గును. ఏమొక్కలు తేమనుబొందజాలని ప్రదేశములలో నిది తేమనుగ్రహించు స్వభావముగలిగియుండును. పశ్వాహారములు తక్కువగానుండు దినములలో ఇట్టిఉత్తమమగు పైరును మంచిఎరువుకట్టి సమృద్ధిగబెంచి యిదివరకే హీనస్థితిలోనుండు మనపశువులస్థితి యింకను దుస్థితికిరాకుండ జాగ్రత్తగొనుట మనరైతుసోదరుల ముఖ్యకర్తవ్యమైయున్నది. ఈగడ్డి పశువులకు మంచిఆహారము; కాని ఎట్టివానికైనను దినమునకు సగమునకంటె నధికముగామేపరాదు. అలవాటయిన పశువులకును ప్రారంభములో కొద్దికొద్దిగా ఈమేతనిచ్చి తరువాత మానివేసినయెడల పశువుల యారోగ్యముచెడును. ఇవి అత్యంత బలకరమగుటచే ఎక్కువగా పెట్టినచో జీర్ణముచేసికొనజాలవు.

## మేపువిధానము.

పాడియావులకు నిదిమంచి ఆహారమేకాని ఎక్కువగా మేపరాదు. గొడ్డుమోతుపశువులకు మేపిన వేడిజేసి చూలు నిలుచును. అమెరికా దేశములో కోళ్లకును పందులకును గూడ దీనిని మేపుదురు. శీతలప్రదేశములలో నీగడ్డి విత్తుటకు పనికిరాదు. కాని మంచుకురియుటవలన ఈపైరు చావక బ్రతుకును. ఉష్ణప్రదేశములలో కొండప్రక్కలను కొండశిఖరములనుగూడ నిది పెరుగును. 8000 అడుగులఎత్తుగలకొండల

మీాదనయితము ఇదిలాభకరముగా పైరగుచున్నది. భూమిలో చాలినంత తేమయున్నయెడల ఎండ పిడుగులు పడినను పైరు చెడదు. నీరులేని తావులలో వర్షాధారమువలన ఇదిపెరుగును. దీనివేళ్లు మిక్కిలిలోతుగా బారుటచే కొన్నాళ్ళు వర్షములేక పోయినను దీనికి నష్టములేదు. ఈకారణమువలన పశువులకు సంవత్సరము పొడుగునను మేలైన పచ్చికదొరకును.

## గినిగడ్డి.

పశ్చిమఇండియాలో పశ్వాహారములకు ముఖ్యమైనది గినిగడ్డి. ఇది సంవత్సరముపొడుగునను పశువులకు మంచిబలమును ఆరోగ్యమునొసంగు ఆహారమగుటచే దీనియుపయోగము వృద్ధియగుచున్నది. ఇది యిప్పుడు చాలవరకు వ్యాపించినది. ఈ గడ్డియందలి ముఖ్యవిషయమేమన నీడను బాగుగా వృద్ధిచేయుటయే యైయున్నది. ఇది మామిడిచెట్లు మున్నగు వానిక్రింద బాగుగా వృద్ధియగును. నీటికాలువలు లేక బోదెలప్రక్కలను వేసినచో మన కెట్టివ్యయప్రయాసలు లేకనే అనుదిన మొకింత పచ్చని ఆహారము మన పశువులకు లభించుచుండును. గినిగడ్డి ఆఫ్రికా (Africa) దేశమునకు చెందియున్నది. 1739 సం॥ నుండి మన హిందూదేశములో వేయుట ప్రోత్సహింపబడినది. ఈగడ్డి దట్టముగా బయలుదేరును. దీనివేళ్లు భూమిపైననే దట్టముగా వ్యాపించియుండును. ఉత్తరహిందూస్థానమువంటి చలిప్రదేశములలో నీగడ్డి శీతాకాలమున నెదుగుబొదుగులేక యుండును. శీతకాలము గడచినపిమ్మట ఉష్ణమధికమైన కొలది బాగుగా పెరుగ నారంభించును. ఇండియాలోని వేడి

ప్రదేశములలోనెల్ల ఇది సంవత్సరముపొడుగునను పచ్చగనుండి చక్కగ పెరుగుచుండును. వేసవికాలములో నీరు పెట్టునపుడు గిరసబారియుండి వర్షములు ప్రారంభింపగనే బాగుగా పెరుగ నారంభించును. వర్షాకాలములోను, ఒకప్పుడితరసమయముల లోను ఈమొక్కలు పూచి గింజలుపట్టును. అప్పటికి 5 మొదలు 8 అడుగుల ఎత్తువరకును బెరిగియుండును. బాగుగా ఎరువు వేయుటవలనను, నీరు పెట్టుచుండుటవలనను గడ్డి బాగుగా వృద్ధియగుచుండును.

సామాన్యముగా వర్షాకాలము (Rainy season) లో ఎక్కువగా గడ్డి లభించదు. పూతపూయు కాడలకంటె ఆకులే సామాన్యముగ సంవత్సరముపొడుగునను వృద్ధియగుచుండును. గినిగడ్డి వివిధములగు ప్రదేశములలో చక్కగా పెరుగునదియై యున్నది. మనదేశములోగాక ప్రతి ఉష్ణప్రదేశములోగూడ నిది విశేషముగా వేయబడి ఎక్కువ యుపయోగకరమైనదిగా పరిగణింపబడుచున్నది. ఫిలిప్పైన్ దీవులలో దీని వృద్ధి మిక్కిలి అద్భుతముగానున్నది. సంయుక్తరాష్ట్రములలోని పల్లపుభూములలోను, టెక్సాసులోని మెరకభూములలోను ఈ గడ్డి బాగుగా పెరుగుచున్నది. శీతోష్ణస్థితి యుష్ణముగనుండి తగినంత తేమ భూమిలో నున్నంతకాలము ఈగడ్డి పెరుగుచునే యుండును. శీతాకాలమున చలి ఎక్కువగానుండు ప్రదేశములలో నిది బాగుగా పెరుగదు. వేడిమి 45 డిగ్రీలకు తగ్గని ప్రదేశములలోగూడ వృద్ధిగానుండును. వర్షాకాలములోతప్ప తక్కినకాలములలో బాగుగా పెరుగకుండుటచే 1906 వ సంవత్సరమునుండి సూరతులో వేయుట మానివేసిరి.

ఇట్లు చేయుటమంచిది కానప్పటికి ఉష్ణముతగ్గి శీతలము హెచ్చినకొలది దీనివృద్ధితగ్గుననుటకు పైవిషయమే నిదర్శనము. మిక్కిలి చలిప్రదేశములలో నెంతనీరుపెట్టి శ్రమపడినను లాభములేదు. శీతలముతగ్గి యుష్ణముహెచ్చిన కొలది తిరిగి బాగుగా పెరుగనారంభించును. ఈగడ్డి లాభప్రదముగ పెరుగవలెననినయెడల నీరుపెట్టుట అత్యంత లాభకరము. నీరుపెట్టనియెడల లాభములేదు. ఈగడ్డి బొంబాయిరాజధానిలో విశేషముగ వ్యాపించియున్నది. ఇది ఏపుగా పెరుగునదగుటచేతను, పశువులకును గుఱ్ఱములకును అమూల్యమగు ఆహారమగుటచేతను, ఇది ఇంతవిశేషముగా అచటవ్యాపించెను. నీరునిలువని ఎటువంటి ప్రదేశములలోనైనను ఈగడ్డి పెరుగును. ఒండుభూములు, ఇసుకతెరభూములు దీనికి మంచివి. ఈగడ్డివేయు భూములు కొంతలోతువరకు గుల్లగనుండవలెను. గనుక బాగుగాదున్నవలెను. భూమిని దున్నునపుడు ఎకరమునకు ముప్పదిబండ్లు పశువులపెంట తోలవలెను.

ఈగడ్డిని దుబ్బుల మూలమునగాని, విత్తనముల మూలమునగాని వ్యాపింప జేయవచ్చును. సాధారణముగా అందరు దుబ్బులనే పాతివేయుదురు. దీనికి కారణము విత్తనములు సరిగా మొలకలెత్తక పోవుటయే ఆయిదారు దుబ్బులను కలిపి ఒక్కొక్కచోట వేయవలయును. ఇట్లు ఒకటిన్నర మొదలు రెండడుగుల ఎడముగా వరుసలు వేయవలెను. ఈ దుబ్బులను వర్షాకాలములో నాటవలెను. ఇతర కాలములలో వేసిన యెడల వెంటనే పుష్కలముగా నీరు పెట్టవలెను.

## గినిగడ్డిని నాటుట

వర్షములు కురియు నపుడు తేలిక భూములలో దుబ్బులను నాటవచ్చును. గట్టి భూములలో వర్షానంతరము నాటుట మంచిది. దుబ్బులు వేరు నాటుకొనినతరువాత పైపైన త్రవ్వవలెను. మొక్కలు కొంచె మెత్తుగానుండు గట్లమీద నుండునట్లు చేయుటవలన అధిక వర్షములు కురిసినను నష్టముండదు. ఈ గడ్డిని మురుగు కాలువలక్రింద వేసినయెడల మిక్కిలి లాభకరముగనుండును. పూనాలో ఒక చెరువులోనుండి ప్రవహించిన కుళ్లునీరు మూలమున 1900 సం॥లో ఎకరమునకు 56308 పౌనుల పచ్చిగడ్డి (Green grass) లభించెనని దెలియుచున్నది. దుబ్బుచేసిన మూడుమాసముల నాటికే మొదటి కోతకు సిద్ధమగును. అప్పటికి మూడు నాలు గడుగుల ఎత్తు పెరుగును. అంతకంటె నెక్కువగా నిలిచినయెడల గడ్డి మృదుత్వముతప్పి పెళుసెక్కును. పెళుసుగడ్డిని పశువు లంతగా దినజాలవు.

### గడ్డిలోనుండు పదార్థములు.

| | |
|---|---|
| నేను | 71.55 |
| మాంసకృత్తులు | 2.62 |
| ద్రావణీయ కర్బనోజ్జనితములు | 18.71 |
| నారపదార్థము | 5.73 |
| చమురుపదార్థము | 1.05 |
| ఖనిజపదార్థము | 1 05 |
| | 100.00 |

ఈ గడ్డి మిగుల ఆరోగ్యకరమగు పశ్వాహారము. పశువులన్నిటికి దీనిని మేపవచ్చును. గడ్డిని ముక్కలుగాచేసి పెట్టిన యెడల త్రొక్కకుండ పాడుచేయును. పాడి పశువులకు మణుగున్నరవరకు పెట్టవచ్చును. ఎకరమునకు 14 టన్నుల తూకము గల గడ్డిని 45 దినముల కొకసారి వచ్చును. ఈ 45 దినములలో అది 6 లేక 8 అడుగుల ఎత్తువరకు పెరుగగలదు. ఇంత ఎక్కువగా గడ్డియు నీయజాలదు. అన్నివిధములైన చతుష్పాద జంతువులకు ఇది ఆరోగ్యకరమైనట్టియు, పుష్టి నిచ్చునట్టియు, ఆహారమైయున్నది. మార్చనక్కర లేకుండగనే 20 సంవత్సరముల వరకుగూడ దీనిని ఒకచోటనె యుంచవచ్చును. దీనిని పైరు చేయుటకు విత్తనము, కలుపు మున్నగువానికి ఖర్చులు మిక్కిలి తక్కువ. ఎనిమిది ఎకరముల జొన్న నుండికూడ ఒక ఎకరమునకు గినిగడ్డి వచ్చునంత గడ్డిచొప్ప రాదు. ల్యూసరన్ మొదలగు వానికి వచ్చునట్లు దీనికి తెగుళ్లురావు. ఇది రోగములు లేనిదనియే చెప్పవచ్చును. ఈ గడ్డిని అమ్మదలచువారికి అత్యంత లాభకరము. ఒక ఎకరమునకు రూ 800-0-0 లాభముకూడ రావచ్చును.

## వరిజాతులు

మన హిందూదేశమునందు సాగుచేయబడు సస్యములలో ముఖ్యమైనది వరి. సాగుచేయబడుచున్న భూమిలో సుమారు నాల్గవభాగము నిదియే సాగుచేయబడుచున్నది. మదరాసు రాజధానిలో నీపైరు సముద్రతీరపు జిల్లాలలోను తిరుచునాపల్లి, ఉత్తరార్కాడు, కృష్ణ, గోదావరి, కావేరి డెల్టా

లలోను, వర్షమెక్కువగ కురియు మళయాళము, దక్షిణ కన్నడము జిల్లాలలోను విశేషముగ పెంచబడు చున్నది.

వరి గడ్డిజాతిలోనిది. అనగా నీటిలో పెరుగు కలువ తామర మొదలగు వానికిని, మెట్టను పెరుగు సామాన్య సస్యజాతులకును మధ్యస్థముగానుండుటవలన అర్ధజలచరమని యు, ఉష్ణమండలవాసియనియు చెప్పవచ్చును.

వరి మొక్క వేళ్లు మృదువుగ పీచువలెనుండును. భూమి లోని కంత లోతుగాపోక పైపైననే యుండును. సుమారు ఎనిమిది అంగుళములలోతువరకు వేళ్లునాటుకొనును.

కాండము బోలుగనుండును. మొక్క మొదటినుండి యనేకములగు పిలకలు పుట్టును. ఇట్లు పిలకలతో గూడిన మొక్కకు దుబ్బుఅనిపేరు. ఒక్కొక దుబ్బునకు 5 నుంచి 20 వరకు పిలకలుండును. మిగుల నెక్కువగా పెరిగిన కొలది దుబ్బునందు పిలకలు నూటికి నుండవచ్చును.

వరి మొక్కయాకులు పొడవుగనుండును. అరంగుళము నకులోపు వెడల్పుగలిగియుండును. ఆకుయొక్కయంచు వాడిగా నుండును. పూవులు గుత్తులుగనుండును. ఈగుత్తులకు వెన్నులనిపేరు. ఒక్కొక వెన్ను అనేక రెల్లలచే నేర్పడును. రెల్లలు పిల్లరెల్లలచే నేర్పడును. ఒక్కొక్క పిల్లరెల్ల కొన్నికాడలేని పూవులుసమూహముగా నుండును.

## వడ్లగింజ

వడ్లగింజ యనునది నిజముగ గింజకాదు దానిని

న్యాయముగా ఫలమనవలెను. పైపొట్టును ఫలకవచమనియు, లోపలి బియ్యపుగింజయే నిజమైన గింజయనియు చెప్పవచ్చును.

## రకములు

వరిలో ననేక వేల రకములు గలవు. సుమారు నాలుగు వేలకు పైగా నున్నవనియు, ఇవన్నియు, అడవిజాతులనుండి దేశకాలభేదములచే మార్పుజెందినవనియు శాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఈ రకములలో ముఖ్యమైనవాటినివ్యవసాయ పత్రికవారు ఈ దిగువ తెలిపిరి.

| రకము పేరు | విశేషముగా పైరు జేయబడు జిల్లా | సారువా లేక దాలువా | ఎన్ని నెలల పంట |
|---|---|---|---|
| మొలకొలుకులు | నెల్లూరు | సారువా | $6\frac{1}{4}$ |
| సన్న ఆట్రగడ్డ | కృష్ణ | ... | 6 |
| ముతక ఆట్రగడ్డ | డిటో | ... | 6 |
| గారీసన్నాలు | బళ్లారి | ... | 6 |
| సిపాయి | డిటో | ... | 6 |
| అకుసరులు | విశాఖపట్టణము | ... | $5\frac{3}{4}$ |
| తెల్లకొణామణి | గోదావరి | ... | $5\frac{1}{2}$ |
| నల్లకొణామణి | డిటో | ... | $5\frac{1}{2}$ |
| బియ్యాహుండా | గంజాం | ... | $5\frac{1}{2}$ |
| తూర్పుసన్నకుృళ్లు | విశాఖపట్టణము | ... | $5\frac{1}{2}$ |
| సన్నకుృళ్లు | డిటో | ... | $5\frac{1}{2}$ |
| రత్నసుడి రత్నసురులు | గోదావరి | ... | $5\frac{1}{2}$ |
| రత్నసుడి | విశాఖపట్టణము | ... | $5\frac{1}{2}$ |
| నీటికొసర | డిటో | ... | $5\frac{1}{2}$ |
| కనకసరులు | డిటో | ... | $5\frac{1}{2}$ |
| మహిపాలీ | డిటో | ... | $5\frac{1}{2}$ |

| | | | |
|---|---|---|---|
| గుత్తికుసుమ | కృష్ణ గుంటూరు | సాగువా | $5\frac{1}{2}$ |
| కృష్ణకాటుకలు | కృష్ణ | ... | $5\frac{1}{4}$ |
| గుమ్మసరి | గోదావరి | ... | $5\frac{1}{4}$ |
| బంగారుతీగెలు | డిటో | ... | 5 |
| సంబల్పూరు | ఉత్తరహిందూస్థానము | ... | 5 |
| సన్నవరి | అనంతపురం | ... | 5 |
| సముద్రవల్లి | ఉత్తరహిందూస్థానము | ... | 5 |
| పునాసఅక్కుళ్లు | కృష్ణ, గోదావరి | ... | $5\frac{3}{4}$ |
| మహారాజభోగాలు | డిటో | ... | $5\frac{3}{4}$ |
| పునాసకొణామణి | ఉత్తరహిందూస్థానము | ... | $4\frac{1}{2}$ |
| రసంగి | కృష్ణ, గోదావరి | ... | $4\frac{1}{2}$ |
| మానవరి | చిత్తూరు | ... | $4\frac{1}{2}$ |
| మోసనం | నెల్లూరు | ... | $4\frac{1}{2}$ |
| చిన్నసంబా | ఉత్తరార్కాడు | ... | $4\frac{1}{2}$ |
| పిశాళిం | నెల్లూరు | ... | $4\frac{1}{2}$ |
| పొదుపాభోగాలు 1 | ఉత్తరహిందూస్థానము | ... | $4\frac{3}{4}$ |
| నెం॥ 2 | ,, | ... | 4 |
| కేసరి | కృష్ణగుంటూరుఅనంతపురం | ... | $4\frac{1}{2}$ |
| ముండ్లవరి | బళ్ళారి | దాళువా | $4\frac{1}{2}$ |
| నల్లఆరెలు | కృష్ణా, గోదావరి | ... | $4\frac{1}{2}$ |
| బంకు | మధ్యరాష్ట్రములు | సాగువా | $4\frac{1}{2}$ |
| బన్స్రుతి | ఉత్తరహిందూస్థానము | ... | $4\frac{1}{2}$ |
| గరికసన్నాలు | కృష్ణగోదావరి | దాళువా | $4\frac{1}{2}$ |
| జసంగి | గోదావరి | ... | $4\frac{1}{2}$ |
| చెన్నంది | అనంతపురం | ... | $4\frac{1}{2}$ |
| మధ్యరాష్ట్రముల పునాససన్నాలు | మధ్యరాష్ట్రములు | ... | $3\frac{1}{4}$ |
| స్వర్ణవరి | తంజావూరు, కృష్ణ, గోదావరి, ఉత్తరార్కాడు | ... | $3\frac{1}{4}$ |

## గడ్డిరకములు స్వభావము

కొన్నిజాతుల గడ్డి మరికొన్నిటికంటె మృదువుగ నుండును. మెట్టపైరులగడ్డి దంపవరులగడ్డికంటె మృదువుగ నుండును. కొనామణి మొదలగు రకములగడ్డి మిక్కిలి మృదువుగ నుండును. కేసరిగడ్డిని పశువులు బాగుగాతినును. మిగుల ఆరోగ్యకరముగాకూడ నుండును. భూమియందలి ఖనిజములను బట్టి గడ్డియొక్క స్వభావము మార్పగలదు. విశాఖపట్టణము జిల్లాలోని గరపనేలలలో పెరుగు గడ్డికంటె గోదావరిజిల్లాలో పెరుగుగడ్డి మృదువుగ నుండును. మృదువుగనుండు రకములలో గడ్డితక్కువగును. మోటుగనుండువానిలో గడ్డియెక్కువగును. దుబ్బు బాగుగా జేయురకములో నట్లుగాక నెక్కువగడ్డి యగును. ఎక్కువకాలములో పండురకములు తక్కువకాలములో పండురకములకంటె నెక్కువ గడ్డినిచ్చును.

వరిగడ్డిలో 8.72 పాళ్లనీరు, 7.3 పాళ్ల మాంసకరపదార్థములు, 45.89 పాళ్ల ఉష్ణకరపదార్థములు, 42.96 పాళ్ళ నారబూడిదపదార్థములు ఉన్నవి. మొత్తముమీద ఈవరిగడ్డిలో నుష్ణకరపదార్థములు హెచ్చుగానున్నవి. అందువలననే వరిగడ్డితో విశేషముగా మాంసమిచ్చు మరియొక పదార్థము కలుపనియెడల సరియైన యాహారముకాదు.

పైనచెప్పిన అన్నిజాతుల వరికడ్డి పశువులకు నుంచి ఆహారమైయున్నది. ప్రతి మెట్టభూమిని మాగాణిగా చేయుచున్నారు. అందుచే పశువుల బీళ్ళకు, మెట్టపైరులకు, పశువుల ఆహారములకు మిగులనష్టము గలుగుచున్నది. కాబట్టి రైతులు

సగభాగము మాగాని, సగభాగముమెట్ట నుంచిన అన్ని సౌక ర్యములకు వీలగును.

## తదితరగడ్డిజాతులు

రెల్లుగడ్డి:— ఇది నదిమొద్దులను, లంకలలోను, పెద్ద పోరంబోకగట్లమీదను, చెరువులచుట్టును పెరుగును. ఇంకను కాలువగట్లు వగైరా వరదలకు తెగకుండ ఈ మొక్కలను నాటుదురు. ఇది మంచిభూమియైనయెడల 20 అడుగులవరకు కూడ పెరుగును. వేరు లోతుగాపోవును. ఆకులు పొడుగుగా సన్నముగానుండును. ఈ గడ్డిని ఇండ్లకప్పులకు ఉపయోగించుదురు. మరికొందరు రెల్లుతడికలు అల్లుదురు. దీనిని పశువులు తినవుగాని మిక్కిలి లేత మొక్కలను దున్నలు, గేదెలు తినును. కాని మొత్తముమీద ఈ గడ్డి పశువులకు అంతమంచిదిగాదు.

ఆరింక గడ్డి:— తేమనేలలయందు అయిదు అడుగుల యెత్తుపెరుగును. దీనిని పశువులు తినవు.

రేవ గడ్డి:—సారవంతమగు భూములయందు నాలుగైదడుగుల ఎత్తు పెరుగును.

పుత్సంగలి:— చెట్లక్రింద డొంకలమీద పెరుగును. అది నేలమీద బ్రాకుచుండును. ఆకులు గరకుగానుండును. మేకలు, గొఱ్ఱెలు ఎక్కువగా దినును.

తుమ్మగరిక:—నేలమీద ప్రాకుచునేయుండును. ఆకులు చిన్నవిగానుండి నునుపుగానుండును. పశువులకు నిది మంచిఆహారమైయున్నది.

గండ్రగడ్డి:— వరిచేలగట్లమీదను, తేమనేలల మీదను పెరుగును. అది కొంతభూమిమీదబడికొంత భాగము పైకిలేచియుండును. కాడ బల్లపరుపుగానుండును. పశువులుతినును.

చిక్లింత:— ఈగడ్డి సగభాగము పైకి లేచియుండును. ఆకులమీద నూగుగలదు. పశువులు తినవు.

ఒండు గడ్డి:—కాడకు ఆకులు రెండుప్రక్కలనే యుండును. రుచిగానుండను. పశువులు బాగుగాదినును. పాడిపశువులకు మేపిన వెన్నను కలుగజేయును.

పెద్దఒండు గడ్డి:—వరిచేలలో మొలచును. ఆకులు గరకుగా నుండును. పశువులుదినవు.

దూసగడ్డి:— చేలగట్లమీదను, కాలువగట్లమీదను పెరుగును. కాడలు గుండ్రముగానుండును. అంత మంచిదిగాదు.

ఉప్పుగడ్డి:— లోతునీటిలోనైనను బెరుగగలదు. వర్షములు లేనిచోట నేలనంటుకొనియుండును. కాడ బల్లపరుపుగా నుండును. అంత మంచిదిగాదు.

చిప్పర:— దీనిని పశువులు బాగుగాతినును. ఎక్కువగా మెరకనేలలందును, బీళ్లలోను పెరుగుచుండును. ఈ మేత దివ్యమైన ఆహారము. పాడిపశువులు తినిన నెక్కువగా పాలిచ్చును.

చిప్పబూర గడ్డి:—నాలుగైదు అడుగుల ఎత్తువరకు నీటిలో పెరుగును. ఇది నీటిమీద తేలుచుండును. గింజలు తెలుపుగానుండును. అంత మంచిమేత గాదు.

తొండంగి:— ఆకులు నునుపుగానుండును. కాడలు ఎరుపుగానుండును. గట్లమీదను, డొంకలమీదలు పెరుగును. చాల రుచిగానుండును. పశువులు చక్కగా దినును ఎక్కువగా తినుచుండినయెడల వాతముగలుగును.

చెంగలి గడ్డి:— నేలమీద బ్రాకును. ఆకులు చిన్నవిగానుండును. అంచులవద్ద మెత్తనినూగుండును. ఈ గడ్డి పశువులకు మిగులయిష్టము. జబ్బుచేయదు.

దర్భగడ్డి:— అడుగు మొదలు మూడడుగుల యెత్తువరకు బెరుగును. ఇదియును పశువులకు మంచిగడ్డియైయున్నది. దీని సన్నకాడలను బ్రాహ్మణకార్యములందు నుపయోగింతురు.

చీపురుగడ్డి:— రాతిప్రదేశములందు బెరుగును. కాడ రెండు మూడడుగుల యెత్తు బెరుగును. దీని ముండ్లే దీనికి విత్తనములు. కాని ఈ గడ్డి మనగృహములు శుభ్రముచేయుటకు చీపురుకట్టలుగా కట్టి యుపయోగించుదురు.

ఉడుతతోకగడ్డి:— ఈగడ్డి బీళ్లలోను, కొండప్రదేశములలోను బెరుగును. ఆకులు మెండుగానుండును. పశువులు బాగుగా తినును.

గునుకుగడ్డి:— ఇదియును మంచిమేతయే బీళ్లలో నెక్కువుగా పెరుగును.

గెలగడ్డి:— ఈగడ్డి కూడ చిట్టడవులలోను, బీళ్లలోను వృద్ధిపొందును. ఇదికూడ పశువులకు మంచి ఆహారము.

తుంగగడ్డి:—నీటిలో పెరుగు తుంగగడ్డికంటె మెట్ట మీద లేచుగడ్డిని పశువులు బాగుగా తినును. రుచిగానుండును.

కొండజెట్టిగడ్డి:—కొండల మీదను, చిన్న గుట్టల మీదను పెరుగును. మేకలు గొఱ్ఱెలు విస్తారముగ దినును.

శంఖిణీగడ్డి:—రెండడుగుల యెత్తుబెరుగును. ఆకులు బిరుసుగా నుండును. ఈగడ్డి అంత ప్రశస్తమైనది గాదు.

పూతికగడ్డి:—పెద్ద పెద్ద కాలువల గట్లమీదను, బీళ్ల లోను పెరుగును. పశువులకు శ్రేష్టమైనది.

కావురుగడ్డి:—మాగానిపొలములలోను, తదితర స్థలములందును ఈగడ్డి పెరుగును. పశువులు బాగుగా దినును.

ఎడ్డిగడ్డి:—దీనికాడలు పలకలుగా నుండును. అంత శ్రేష్ఠ మయినది గాదు.

గొడ్డుతుంగ:—ఈగడ్డి పగిరుగా నుండును. గేదెలు దున్నలు మాత్రము కొంచెముగ దినును.

తెగడతుంగ:—నీడ పడియున్న ప్రదేశములందు బెరుగును. అన్ని పశువులు మిగుల ప్రీతితో దినును.

వరిగ, చోడిగడ్డి:—మృదువుగ నుండును. మిగుల బలముకలిగించును. వరిగడ్డికంటె మిగుల సారవంతమైనది.

గరికగడ్డి:—సారవంతములగు భూములలో ఈగడ్డి మొలచును. ఈగడ్డి మంచి బలము కలుగజేయును. పాడిపశు

వులకు మేపిన వెన్న యెక్కువగును. రోగపశువులకు పథ్యముగా పెట్టవచ్చును.

గంటెచొప్ప:—ఇదియును మెట్టపైరే. ఈచొప్పను అంతగా పశువులు తినవు గాని ఈగంటెలజావపెట్టిన పాలె క్కువ నిచ్చును.

తుమ్మకాయలు:—ఈకాయలలో జిగురువంటి పదార్థ ముండును. ఈపదార్థము చాల బలకరమైనది. వేసవికాలములో ఈకాయలను మేపిన మంచి సత్తువనిచ్చి కండబట్టును.

## కాడ జాతులు

తోటకూర:—వీనిలో కొన్నిటికి ఎరుపురంగుగల కాడ లుండును. ఇదియే ఎఱ్ఱతోటకూర. కొన్నిటి కాడలు నాలుగు, ఆరడుగులెత్తుకూడ పెరుగును. ఈఆకులు పశువులకు మిగుల బలము కలిగించును.

చిలకతోటకూర:— తోటకూరవలెనే యుండును. చిన్నగుబురుమొక్కలుగానుండును. మనుష్యులు అరుదుగా కూరను వండుకొందురు. ఈకూరకూడ పశువులకు మంచి ఆహా రమైయున్నది.

ముళ్లతోటకూర:— వర్షాకాలములో విశేషముగా పెరుగును. దీనికి ఆకులువద్ద ముండ్లుగలవు. పాడిపశువులకు పెట్టిన పాలెక్కువపడును. పశువులకు కలుగు కాలినొప్పులకు బెణుకులకు దీనిని తవుడుతో కలిపి ఉడికించి రెండుమూడుకట్లు కట్టిన తగ్గును.

కొయ్యతోటకూర:—కొంచె మించు మించుగ చిలక తోటకూరవలె నుండును. ఈ మొక్కలు దానికంటె కొంచెము చిన్నవి. దీనిని కూరవండుకొందురు. పశువులకుపెట్టిన బాగుగా బలియును.

పొన్నగంటికూర:—ఆకు లొకొక్కచోట రెండు రెండున్నవి. దీనినికూడ కూరవండుకొందురు. పశువులు ఈ కూరను బాగుగాతినును.

బచ్చలికాడ:—ఈకాడ, ఆకులు కండగలిగియుండును. పశువులకు పెట్టిన మిగుల సత్తువ గలుగును.

బొబ్బరికాడ:—వీటిలో రెండురకములు గలవు. ఈ కాడను వర్షాకాలములో బాగుగా మేపుదురు. వర్షాకాలము కంటె శీతాకాలము మేపినకాడబలముగలదిగానుండును. వెన్ను ముదిరిన తరువాత మేపుటమంచిది. లేతది మేపినయెడల బలము గలుగజేయక మూత్రి మధికముగా పోయును. వాతరోగ ములు జనించును.

పెసరకాడ:—వరిచేల గట్లమీదను మాగాని చేలు కోతకోసినతరువాతను పెసరవిత్తనము వేయుదురు.

అనపకాడ:—ఈకాడయందు ఒక విధమైన సువాసన గలదు. పశువులకు పెట్టిన బలము గలిగించును.

మినపకాడ:—ఈకాడ పశువులకు శీతకాలములో పెట్టిన మంచిబలము గలుగజేయును. వాతముగల పశువులకు పెట్టరాదు. అట్లు పెట్టినయెడల పక్షవాతమును గలుగజేయును.

ఉలవకాడ:—ఈ మొక్కలువేసిన రెండు నెలలలోనే పెంపొందును. వరికోతలైన తరువాత మాగానిచేలలోను మెట్టచేలలోను వేయుదురు. ముదరకుండ మేపినయెడల వగరుగానుండి పశువులుతినవు. పైనచెప్పినకాడలన్నియు కాయలు కాచి ముదరనిచ్చిన తరువాత మేపిన మంచిబలము గలుగ జేయును. దీనిని ఎండబెట్టి వరిగడ్డి, జొన్నచొప్పవలె మేపినను మేపవచ్చును.

పిల్లిపెసర:—ఇది పశువులకు మంచి యాహారమేగాని పశువులు ఎంత విస్తారముగాతినిన అంత విషముగ పనిచేయును. వర్షాకాలములో తినిన పశువులకు వేసవికాలములోను, వేసవి కాలములో మేసిన పశువులకు వర్షాకాలములోను వాతరోగ ములు నేత్రరోగములు తప్పకకలుగును. కాబట్టి ఈ పైఆహార పదార్థములు తినినంతకాలము ఉప్పుగాని తెలకపిండిగాని అప్పు డప్పుడు పెట్టుటమంచిది. ఈమేతను అప్పుడప్పుడు పెట్టుట మంచిదిగాని వరుసగా మేపుట అంత మంచిదిగాదని నాయభి ప్రాయము.

గడ్డినిపాతరవేయుట (Ensilage)

మనదేశములో సామాన్యముగ ఎండుగడ్డినే వాములు వేయుచుందురు. మంచిగడ్డికి ఎండఅంతఅవసరముగాదు. ఇటీవల దేశములో వ్యవసాయనిపుణులుపనిచేయప్రారంభించిన దాదిగా ఒకనూతనవిధాన మవలంబింపబడుచున్నది. గడ్డికి సూర్యరశ్మి (Sun shine) అంతప్రధానము గాకపోవుటచేత దానిని పాత రలలో గాని, గదులలో గాని భద్రపరచి యుంచవచ్చునని

వ్యవసాయడిపార్టుమెంటువారు తెలుపుచున్నారు. మనదేశపు రైతులు ధాన్యమును పాతరవేయుటనగా భూమిని కొంచెము లోతుగాత్రవ్వి దానిలో గడ్డివేసి ధాన్యముపోసి కప్పియుంచుట. ధాన్యములెనే గడ్డినికూడ పాతరవేయుట విదేశములలో నాచారమైయున్నది. గడ్డినిపాతరవేయుటవలన పశువులకు సర్వకాలములయందు మంచిపచ్చిమేత దొరకుచుండును. ఎండుగడ్డికంటె పాతరవేయబడిన పచ్చిగడ్డి పశువుల కెక్కువ ఆరోగ్యమునిచ్చు ఆహారమైయున్నది. వేసవికాలములో పశువులకు మేతదొరకని కాలములందు ఈ పాతరలోనిగడ్డిని మేపవచ్చును. వర్షాకాలములో మేత పుష్కలముగానుండునుగాన అట్టిసమయములందు ఈగడ్డిని వెన్నువేయుచున్నపుడు కోసి పాతరవేయవలెను. ఎండుగడ్డిచేయుటకన్న ఈగడ్డినిచేయుట చాల ఖర్చుతక్కువ. దీనికి అగ్నిభయముగాని, చోరభయముగాని యుండదు. కలుపుమొక్కలను భూమినుండి తీసివేయుటకగు ఖర్చులేకుండ వానిని మేతకు పనికివచ్చునట్లుచేసి లాభముగా నుపయోగపరచువిధము ఇదియొక్కటియే. ఈ మేత ఎక్కువరుచిగానుండి త్వరగా జీర్ణమగును.

మనదేశము వేడిప్రదేశము. భూమిలోనివేడి పాతరలోనికివ్యాపించి దానిలోని ఆహారమును ఆవిరిచేసి పాడుచేయును. కాబట్టి గోతులుపూడ్చుసమయమున వర్షములులేకుండచూచి పూడ్చవలెను. గడ్డినిగాని చొప్పనుగాని పచ్చిగానున్నప్పుడే పాతరవేయవలెను. ఎండుగడ్డిని పాతరలలో వేయరాదు. గడ్డికి పదునులేనియెడల గోతిలేని గడ్డిమీాద ప్రతివరుసమీాద నీరు

జల్లవలయును. కానివ్యవసాయడిపార్టుమెంటు వారు ఎక్కువగా ఈపద్ధతుల ప్రకారము తయారుచేసిన గడ్డిని ఉపయోగించుచున్నారు. మనరైతుసోదరులుగూడ దీనిని ఆచరణలో పెట్టుట మంచిదని నాఅభిప్రాయము.

## ఉపయోగింపదగిన పైరులు

పచ్చిగడ్డి, పచ్చిజొన్న, బొబ్బర, గినిగడ్డి, ఏనుగగడ్డి, పొద్దుతిరుగుడుచెట్టు, మొక్కజొన్న, పచ్చియవలు మున్నగునవి ఉపయోగించవచ్చును. మొక్కజొన్నచొప్ప ప్రొద్దుతిరుగుడుచెట్టు మంచిఆహారమునిచ్చును.

## పాతరలకు స్థలములు

పైరు పెరుగుచున్న పొలములో నొకమూల నీ పాతర తీయుట మంచిది. దీనివలన కూలి కలసివచ్చును. ఈ పాతరలు ఎత్తయిన స్థలమునందుగాని, నీరు నిలువ యుండని స్థలమునందుగాని వేయుట మంచిది.

## గోతుల పరిమాణము

గోతులు చతురముగాగాని, గుండ్రముగాగాని యుండవచ్చును. ఈ పాతరలు వేయుట హోసూరు ఎగ్రికల్చరల్ ఫారములోనున్నది. ఈ రెండు విధములైన పాతరలు వేయు పద్ధతులును గలవు. పచ్చిక ముక్కలుగాగాక మొదట వేయబడిన పరిమాణముతోనే పడవేయునప్పుడు గోయి ముఖ్యముగా నలుచదరముగా నుండుట మిగుల మంచిది. ఎండుగడ్డి వామినుంచి యేలాగు వేయుచున్నామో అటులనే ఈ

పాతరలోని గడ్డిని కావలసినప్పుడు ఘనగజముల లెక్కను తీయవచ్చును. పాతర లోతుగానుండరాదు. పాతర యడుగున తడి యెక్కువగా నుండవచ్చును. కొంతమంది రాతితో గట్టిన గోతులు మంచివందురు. ఇవి అంత ప్రయోజనము కావనియు, అనవసరఖర్చు అగుననియు, మాగుడులోనుండు యెక్కువ చెమ్మను భూమి పీల్చుకొండ నాపుజేయుననియు మద్రాసు వ్యవసాయ డిపార్టుమెంటువారు తెలుపుచున్నారు. పాతరల యొక్క పార్శ్వములు నిలువుగా నున్నయెడల బరువు అన్ని ప్రక్కలను సరిగా ఆనును. భూమి యిసుకనేలగాని గుల్లనేల గాని అయినయెడల పాతరయంచులను మాత్రకతీగెలవలతోగాని లేక తగినటువంటి యితర వస్తువులతోగాని కట్టవలెను.

సరకబడనటువంటి పొడుగగు జొన్నచొప్ప యొక్క గాని, మొక్కజొన్నయొక్కగాని మాగుడు ఘనయడుగు నకు 20 పౌనులు తూగునని సంయుక్తరాష్ట్రములలో కను గొనబడినది. ఏదైన ఒక పైరుయొక్క విస్తీర్ణమును మాగుడు చేయుటకు కావలసిన గోతుల పరిమాణమును గుణించుటకు పై సంఖ్యను తీసికొనవచ్చును. ఎట్లనగా ఒక యకరమునకు 300 మణుగులు వచ్చు 3 యకరముల జొన్నచేనునకు 1200 ఘనపుటడుగుల పరిమితిగల గోయి కావలెను. ఈ క్రింది కొలతలుగల గొయ్యి మిగుల నుపయోగకరముగా నుండును. 8 అడుగులలోతు, 15 అడుగుల పొడవు, 10 అడుగుల వెడల్పు ఈ రాజధానిలో నట్టి గోతిని త్రవ్వుటకు సుమారు పది రూపాయ లుండును.

## గడ్డికోత, గోతులనుపూడ్చుట.

పచ్చికను వెన్ను వేయుసమయమునందు కోసివేయవలెను. తదుపరి పనికిరాదు. మొక్కజొన్నను గింజ పట్టబోవుచుండగా కోయవలెను. పచ్చికను కోసినవెంటనే గోతియొద్దకు తోలవలెను. ఇట్లు చేసినయెడల ఎండుటతటస్థించదు. ఆపైరులో కొంతకోయుకముందుఎక్కువ పక్వమైయున్నయెడల నీటిని పోయవచ్చును. లేకపచ్చిపైరు కోసి దానితో కలుపవచ్చును. పాతరలోనిగడ్డిని యణగత్రొక్కుటకు ఒకజతఎద్దులచే త్రొక్కించవచ్చును. లేదా కూలీలచేతనైన త్రొక్కించవచ్చును., పాతర మూలలపక్కలనుగూడ బాగుగా త్రొక్కించవలెను. ఇట్లు చేయనియెడల పాతరతీసినపుడు నష్టముండును. చొప్పనుగాని గడ్డినిగాని నరకు యంత్రముతో నరికిన మిగుల మంచిది. కాని ఈపద్ధతి విధిగా చేయునవసరములేదు. గోతిని భూమిమట్టమునుండి రెండుమూడడుగుల యెత్తువరకునింపి బాగుగా త్రొక్కవలెను.

## గోతిని కప్పుట.

పైన చెప్పినరీతిగా గోతిని నింపినతరువాత మట్టిని యంచులను గట్టిగా పోయవలెను. ఇట్లు చేయుటచే గుట్టగా పోయబడిన పచ్చిగడ్డికి దాపుయేర్పడి దానిని పైకి పోకుండా చేయును. ఈగట్టు గోతిచుట్టును పైఅంచునకు రెండుమూడు అడుగులవరకు వ్యాపించియుండవలెను. దీనివలన గోతిలోనికి గాలియును నీరును పోజాలవు. తరువాత మట్టిని గడ్డిమీద ఒక అడుగుఎత్తున పోయవలెను. ఇందువలన గడ్డి బాగుగా

నొక్కబడి లోనికి దిగును. మధ్య మన్ను యెక్కువగా పోయ వలెను. మూడడుగులు దట్టముగ పోసినయెడల నీరు నిలువక వెంటనే క్రిందకు జారిపోవును. మట్టిమీద పగుళ్లు, గుంటలు యున్నయెడల సర్దుబాటు చేయవలెను. నల్లరేగడ నేలలోని గోతుల చుట్టియుండుభూమి పగులునెడల వెంటనే పూడ్చ వలెను. ఇట్లు చేయుటవలన పాతరలోనిగడ్డి కుళ్ళిగును. నీరు గాలి దానిలోప్రవేశించకుండమాత్రము జాగ్రత్తగా కాపాడు చుండవలెను. పాతరచుట్టు మురుగునీరు పోవుటకు అడుగు వెడల్పు అడుగులోతుగల ఒక కాలువను త్రవ్వవలెను.

## పా త ర తీ యు ట

పశువులకు పచ్చికగాని, మృదువైన పచ్చిమేతగాని దొరకని కాలమందు అనగా మార్చి, ఏప్రియల్ నెలలలో పాత రను తీసికొనవచ్చును. ముందుగా ఒక గజమువెడల్పున త్రవ్వి కావలసినది తీసికొని మరల మట్టిని కప్పవలెను. ఇట్లుచేసిన ఎండిపోవుటవలన నష్టము కలుగదు.

## మే పు ట

ఈపాతరనుంచి తీసిన గడ్డిని పాడిపశువులకు, సంవత్స రము వయస్సు దాటిన దూడలకు పెట్టవచ్చును. పశువులు వెంటనే దీనిని తినవు. కాబట్టి వరిగడ్డితోగాని యెండుగడ్డితో గాని కలిపి కొంచెముకొంచెముగా పెట్టుచుండవలెను. ఈరీతిగా చేసినచో వారము దినముల కది అలవాటుపడును. పూర్తిగా పాలనిచ్చు పాడిపశువులకును, దుక్కియెద్దులకును దినము

నకు 30 లేక 40 పౌనులవంతున పెట్టవచ్చును. ఈగడ్డి పాలను వృద్ధిచేయును. గాలి కుంటుతగిలిన పశువుల కిది శ్రేష్ఠము.

## పర్యవసానము

పొలమునకు యెక్కువగ ఎరువువేసినపుడు పైరు విస్తారముగా పెరిగినయెడల పాతరవేయకపూర్వము 10 నుంచి 12 గంటలవరకు బయట చిన్న కుప్పలుగా యుంచుట మంచిది. ఎక్కువగానున్న తడియారిపోయి కొంతవరకు పులియును. పాతరనుంచి తీసినగడ్డి దుర్వాసనగా నుండును. ఎక్కువ పసరున్న గడ్డికి వాసన హెచ్చుగనుండును. ముదురుగడ్డి రుచిగానుండును.

ఆరుపశువులకంటె తక్కువగానున్న రైతు పాతరవేయ వలసిన అవుసరములేదు. వేసినను లాభములేదు. పశువుఒకటికి దినమునకు 40 పౌనులువంతున ఆరుపశువులకు ఒకనెలకు 7200 పౌనులును, మూడు మాసములకు 21600 పౌనులును కావలెను. కాబట్టి ఇందులకు మూడువివరముల పచ్చికపైరును వేయువలసియుండును. అంతకు ఎక్కువ సలహాలు కావలసినవారు వ్యవసాయ డిమాన్స్ట్రేటరును కనుగొనుడు.



# ప్రముఖులఅభిప్రాయములు

శ్రీరాములుచౌదరిగార్కి పశుసేవను గూర్చి చేయుచున్న కృషికి నేను మిక్కిలి సంతసించుచున్నాను. వీరు సామాన్యఆపరేషన్సు, ఔషధములిచ్చుట కూడ చేయుచున్నారు. అంటువ్యాధులవిషయమై రైతులకు బోధించుచున్నారు. నోరులేనిపశువులకు మిగుల కష్టించియు, మిక్కిలి యుత్సాహముతో సేవజేయుచున్నారు. ఎట్టి ప్రోత్సాహమునకైనను అర్హులు.

(సం) సి. వి. రత్నం,
కృష్ణా గుంటూరు జిల్లా వెటరినరీ ఆఫీసర్.

---

చౌదరిగారిచే స్థాపింపబడిన ఆయుర్వేదపశుచికిత్సాలయమును సందర్శించితిని. చికిత్సలవిషయమై చాల తృప్తికరముగా నున్నది. పశుసంరక్షణవిషయమై వీరు తీసికొనుచున్న శ్రద్ధ అపారము. ఎట్టిప్రోత్సాహమునకైనను అర్హులు.

(సం) కె. బి. నటేశయ్యారు,
జిల్లా పశువైద్యఆఫీసర్.

---

శ్రీరాములుగారి చికిత్సాలయమును చూచితిని. ఇది క్రమపద్ధతిని అభివృద్ధిజెందుచున్నది. మూగజీవులకు వీరొసంగురక్షణ, మిగులప్రశంసనీయము. ఆయుర్వేదపశువైద్యగ్రంథములు వ్రాసి తత్సంబంధమైన వైద్యమును వీరు అభివృద్ధిపరచిరి. అన్ని ప్రాంతములవారు తగినసహాయము చేయుదురు గాక.

(సం) ఆర్. వీరాస్వామి,
వెటరినరీ అసిస్టెంటుసర్జన్.

---

చౌదరిగారు ఆయుర్వేదౌషధములచేతనే చికిత్సలు చేయుచున్నారు. పశువైద్యశాస్త్రమునందు అనుభవము పొందినవారై తదితరజిల్లాలనుండి రాబడిన విద్యార్థులకు బోధించుచున్నారు. ఈ సంవత్సరము గవర్నమెంటు వారిచే రిజిస్టరుడు చేయబడినందువలననే చాలమంది విద్యార్థులు విద్య నభ్యసించుచున్నారని తెల్పుట సంతోషము. అంటువ్యాధులయందు కూడ వీరికి పరిచయము కలదు.

కె. యం. పేరనన్,
వెటరినరీ అసిస్టెంటు సర్జన్.

---

శ్రీరాములుచౌదరిగారిచే నడుపబడుచున్న నిఖిలాంధ్రాయుర్వేద పశువైద్యకళాశాలను, పశుచికిత్సాలయమును చూచి మేము చాలఆనంద పడుచున్నాము. కాలేజీలో చాలమందివిద్యార్థు లున్నారు. వీరిని ఆయుర్వేద పశువైద్యపద్ధతులమీద తర్ఫీతుచేయుచున్నారు. చౌదరిగారు చికిత్సలు చక్కగా చేయుచున్నారు. ఎట్టిప్రోత్సాహమునకైనను అర్హులు.

యన్. వి. శ్రీధరరావు,
వెటరినరీ సర్జన్, జి. యం. వి. సి.

యస్. శ్రీనివాసరావు,
మ్యునిసిపల్ వెటరినరీ అసిస్టెంటు సర్జన్.

---

చౌదరిగారిచే స్థాపింపబడిన చికిత్సాలయము చూచితిని. నవీనపద్ధతులతో నడిపింపబడుచూ నోరులేని వేలకొలదిజంతువులను రక్షించుచున్న నూతనోద్యమము. ప్రశంసార్హమగు వారి యుద్యమము జయముగాంచు గాక.

కె. గురుమూర్తి,
అగ్రికల్చర్ డిమాన్ స్ట్రేటరు.

---

శ్రీరాములుచౌదరిగారిచే నడుపబడుచున్న పశుచికిత్సాలయమును, పశువైద్యకళాశాలను దర్శించితిమి. ఆంధ్రదేశములో నేగాక రాజధానిలో కూడ వేరొకసంస్థ లేదు. వీరిపట్టుదల, మేధాశక్తి అపూర్వము. ఇట్టి సంస్థలను ఆధారము చేసికొనినగాని గ్రామపునరుద్ధారణకు మనరాజకీయవేత్తలు పెద్దలు పడుశ్రమ పరిపూర్ణఫలమునొందదు. ఈ సంస్థ అన్నివిధముల అభివృద్ధిజెందుగాక అనికూడ అభిప్రాయము.

వి. బుధవేశ్వరరావు,
డిప్యూటీ డైరక్టర్ ఆఫ్ అగ్రికల్చర్,
2 వ సర్కిల్, గుంటూరు.

యస్. శివరామపాత్రో,
అగ్రికల్చర్ ఆఫీసర్.

---

చౌదరిగారి కళాశాల, చికిత్సాలయములను చూచితిని. వారు చేయుచున్నపని చాల అత్యద్భుతముగానున్నది. గ్రామపునర్నిర్మాణమునకు దగినటుల ఈసంస్థలు పనిచేయుచున్నవి. వీరు దిగ్విజయమును పొందుదురుగాక.

చంద్రశేఖరం,
డిప్యూటీరిజిష్ట్రార్
కో-ఆపరేటివ్ సొసయిటీస్.

---

చౌదరిగారి చికిత్సాలయము పరిశీలించితిమి. పశుసంరక్షణవిషయమై చౌదరిగారు అనేకరీతులుగా చాల శ్రద్ధతీసికొనుచున్నందులకు మేమెంతయు సంతసించుచున్నాము.

డి. సదాశివరెడ్డి,
మద్రాసుప్రెసిడెన్సీ డిప్యూటీ ఎడ్యుకేషనల్ డైరక్టర్.

యం. అబ్దుల్ఆలీ,
కృష్ణాజిల్లా ఎడ్యుకేషనల్ ఆఫీసర్.

---

ఆయుర్వేదపశువైద్యమునం దీమాత్రపుకృషి మిత్రుడుసల్పుచుండు టెంతో ప్రీతికరమైనవిషయము. వీరొసగు పశువైద్యవాఙ్మయము ఆంధ్ర దేశమునకును, రైతులకును మిగుల ప్రయోజనమైనది.

బి. రామయ్య,
ఎ. డిమాన్‌స్ట్రేటర్.

---

ఆంధ్రదేశములో ఆయుర్వేద పశుచికిత్సాలయములుగాని, ఆయుర్వేద పశువైద్య కళాశాలలుగాని సరియైన ఆయుర్వేద పశువైద్య గ్రంథములుగాని యింతవరకు లేవనియే చెప్పవచ్చును. ఇట్టి సమయములో "అభినవ సహదేవ" శ్రీరాములు చౌదరిగారు పై సంస్థలను తన స్వయంకృషిచే వృద్ధిలోనికి తీసికొనివచ్చుచున్నందులకు ఆంధ్రదేశములోనున్న ప్రజలందరు గర్వింపతగిన విషయము. వీరి కాలేజికూడ చాల వృద్ధిలోనున్నది. స్థానిక సంస్థలుకూడ స్టయిపెండ్సుయిచ్చి విద్యార్థులను ఈ కాలేజికి పంపుచున్నారనిన ఆంధ్రదేశమున కెంతలాభముగలదో చదువరులే గ్రహించుదురుగాక. ఇంకను తరగతులవారీగా 20 పశువైద్యగ్రంథములువ్రాసినారంటే ఎంతగొప్పమేధావంతులో పాఠకులే గ్రహించుదురుగాక. వీరి గ్రంథములు త్వరలో అప్రూవ్ చేయించి అన్ని పాఠశాలలలోను పెట్టించిన చాల ఉపయోగకరముగానుండును. నూతనముగావచ్చిన కాంగ్రెసుమంత్రులు ఈ కళాశాలను రికగ్నయిజు చేయించి అన్ని ఫిర్కాలలోను ఈ ఆయుర్వేద పశువైద్యమును వ్యాపింపజేయగలరని నా నమ్మిక.

ఎ. వి. రామలింగపాట్నాయక్,
యం. బి. బి. యస్.

---

డాక్టరుగారి స్వగృహమున ఒక పెద్దహాలులో పశుచికిత్సాలయము స్థాపించబడి వివిధపరికరములచే సమకూర్చబడియున్నది. పేదలనక భాగ్యవంతులనక అందరికి నుచితముగా చికిత్సలుచేయు ఇట్టి సంస్థ మరెచ్చటను లేదు. ఔషధములు తయారుచేయుటయేగాక డాక్టర్ గారు పశురోగములను, దేహతత్వములను బోధపరచుటకు అనేకపటములు, చిత్రపటములు కూడ తయారుచేసినారు. పశువైద్యశాస్త్రమునందు శిక్షను గఱపుటకై

ఆయుర్వేద పశువైద్యకళాశాలను గూడ వీరు నడుపుచున్నారు. ఈ సంస్థ యెంత ప్రజాదరణమును బడసినదో ఇతర జిల్లాలనుండి ఈ కళాశాలలో జేరుటకు వచ్చినవారివలన తెలియుచున్నది. పదునొకండవ కమ్మ మహాజన సభయందు చౌదరిగారి సేవకై మెచ్చి వారిని "అభినవసహదేవ" అను బిరుదముచే బహూకరించిరి. ఈ బిరుదమునకు వీరెంతయు అర్హులు. వీరు పశువైద్యమునందు చేసిన కృషి, సేవయు, మంత్రులు, జిల్లాబోర్డు అధ్యక్షులు, గవర్నమెంటు పశువైద్య ఉద్యోగస్థులు, పెద్దపెద్ద భూస్వాములు మున్నగువారిచేత పొగడ్తగాంచినవి. పశువైద్యమునందు పురాతనపద్ధతులన్నియు మార్చి ఆధునికపద్ధతులపై వైద్యముచేయు ఇట్టి డాక్టరుగా రుండుట మనమెంతయు గర్వించవలసిన విషయము.

చౌదరిగారి గ్రంథములను, ప్రతిగ్రామ పాఠశాల పుస్తకభాండాగారమునకు, ప్రతిఆయుర్వేద చికిత్సాలయమునకు సప్లయిచేయుటవలన స్థానికసంస్థలుచేయు అమూల్యసేవకు మేరలేదని మదరాసు శాసనసభాధ్యక్షులగు గౌ॥ బి॥ రామచంద్రారెడ్డిగారు వెల్లడించిన అభిప్రాయముతో నేనును పూర్తిగా ఏకీభవింతును. చౌదరిగారి ఉత్కృష్టసేవకై వారి నభినందించుచు వారి సంస్థాభ్యుదయమునకై నేను కోరుచున్నాను.

వి. సత్యనారాయణ,
తహశ్శీల్దారు, గుడివాడ.

---

ఈ చికిత్సాలయము నెంత ప్రోత్సహించిన అంతమేలు. ఆధునిక పద్ధతులతో నడుపబడుచున్నది. అంటువ్యాధుల నివారింపగలశక్తి ఈ చికిత్సాలయమునందు గలదు. ఈసంస్థ జయప్రదముగా సాగుగాక.

శ్రీ రాజారావు,
తహశ్శీల్దారు, గుడివాడ.

---

నేడుదయమున అంగలూరులో నెలకొల్పబడిన ఆయుర్వేద పశు చికిత్సాలయమును చూడగలిగినందులకు చాల ఆనందించుచున్నాను. ఈ సంస్థవిషయమై చౌదరిగారు చాల శ్రద్ధవహించుచున్నారు. వీరి పరిశ్రమ ఫలించి యీ సంస్థ మరికొన్నిటికి ఆదర్శప్రాయమై చిరస్థాయిగా వెల యుచు లోకల్ బోర్డులయొక్కయు, భూస్వాములయొక్కయు సహాయ మునకు పాత్రమార్హమై యుండును.

యన్. నరసింహరాజు,
తహశ్శీల్ దారు, గుడివాడ.

---

శ్రీరాములుచౌదరిగారు మూగజీవులకు ఆయుర్వేద పద్ధతులతో చికిత్స చేయుచున్నందులకు సంతోషించుచున్నాను. కొందరు విద్యార్థులు వారు స్థాపించిన పాఠశాలలో తర్ఫీయదగుచున్నారు. త్వరలో గవర్న మెంటువారు రికగ్నయిజు చేయుట మంచిది.

సి. హెచ్. వెంకటేశం,
డిప్యూటీ యిన్స్పెక్టరు ఆఫ్ స్కూల్సు.

---

రైతులక్షేమమునకై, వారిపాడిపంటలవృద్ధికై వారి గడపలపసిమికై, వారి స్త్రీలహృదయవికాసమునకై యుపయోగపడు ఈ పశువైద్యచింతా మణిని తుద కిప్పటికైనను మన చౌదరిగ్గారు ఈ రూపముగా నిచ్చినందులకు సంతసము.

ప్రొఫెసర్, జి. రంగనాయకులు,
బి. లిట్. (ఆక్సుఫర్డు), యం. యల్. ఏ.

---

శ్రీరాములుచౌదరిగారు ఆదర్శప్రాయమగు వైద్యశాలను స్థాపించి స్వయముగ నెల్లరకు దగు అనుభవముల విశదపఱచి ఆంధ్రదేశమున కాద ర్శకు డాయె ననుటలో నతిశయోక్తి లేదు.

కల్లూరి చంద్రమౌళి,
బి. యస్, సి. (వ్యవ), బర్డిన్, యం. యల్. ఏ.

---

శ్రీకృష్ణాజిల్లాబోర్డువారు యీ ఆయుర్వేద పశు చికిత్సాలయ సంస్థకు రు 500-0-0 విరాళమొసంగుట చాలసంతోషమైన విషయము. ఈవిరాళము ప్రతిసంవత్సరము నొసంగబడునని నేను తలంచెదను. గవర్నమెంటువారు యిటువంటి సంస్థలకు యెల్లకాలము కొంత ధనసహాయమును చేయుట చాలసమంజసము. ఈసంస్థ జయప్రదముగా సాగుచుండుగాక.

పి. వి. నారాయణ,
డెలిగేటు ప్రెసిడెంటు, కృష్ణాజిల్లాబోర్డు.

---

రైతాభ్యుదయముకొరకు స్థాపించిన పశుచికిత్సాలయమును గూర్చియు వారినిర్మలత్వమును, నిష్పాక్షికత్వమును గూర్చియు వచించుటకు, గుణగ్రహణము చేయుటకు నెంతయు ఆనందించుచున్నాను. వీరు నడుపుచున్న పశువైద్యశాల కడుశుభ్రముగ నున్నది. మందులకొదువయుండదు. వారి వైద్యశాల రిజస్టరు వారికున్న పలుకుబడిని, ప్రతిదినము వ్యాధినివారణార్థము వచ్చు పశువులసంఖ్యను, స్పష్టముగా సూచించుచున్నది.

వర్ఘూర్ ఆ రేషమ్,
జిల్లా ఆరోగ్య శాఖాధికారి.

---

ఆయుర్వేదశాస్త్రపద్ధతిని శ్రీ చౌదరిగారు పశువులకు చేయుచున్న సేవ ప్రశంసనీయము. ప్రభుత్వమువారును స్థానికసంస్థలును సర్వవిధముల సహాయపడి యీఉద్యమమును ప్రోత్సహించుట అవసరము. అందుకు ఈచికిత్సాలయము అర్హతపొందినది. సర్వేశ్వరుడున్ను ఆశీర్వదించుగాక.

తుర్లపాటి వెంకటేశ్వరరావు,
బారిష్టర్, జిల్లాబోర్డుమెంబరు.

వి. కనకబాపయ్య,
అడ్వకేటు.

వి. రామకోటయ్య,
బి. ఎ., బి. యల్.

---

## లింగం వీరభద్రియ్యగారు, బి. ఏ. (ఆక్సుఫర్డు) బ్యారిష్టర్.

మనదేశము వ్యవసాయముమీద చాలవర కాధారపడియున్నది. రైతులకు పశువులుమూలము. కొన్ని సంవత్సరములనుండి వ్యవసాయమున కాధారభూతమైన పశువులను తగినట్లుగ పోషించుటయు జరుగుటలేదు. శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారు పశువుల సంరక్షణకు తగిన విద్యను సంపాదించి పుస్తకములరూపముననుు తమ వైద్యశాల మూలముననుు రైతులకు సాయపడుచుండుట మిక్కిలి ప్రశంసాపాత్రము. రైతుబిడ్డలగు వీరు రైతునకు ప్రాణాధారమువంటి పశువుల సంరక్షణకు పూనుకొనుట మిక్కిలి సమంజసము. వీరి పరిశ్రమ అభివృద్ధిలోనికి వచ్చుగాకయని ఆశపడుచున్నాను.

---

## యస్. నరసింహారావుపంతులుగారు, డిప్యూటి యిన్స్పెక్టరు, గుడివాడ రేంజి.

నేను శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారి ఆయుర్వేద పశువైద్యశాలను, వారిచే రచియింపబడిన పలు పశువైద్యగ్రంథములను చూచితిని. వీరు అనుభవ వైద్యముచేతనే యింత యున్నతదశకు రాగలిగిరి. వీరు చేయుపని, కృషి, సేవ యెంతయు నుపయోగార్థమైనవి. ప్రశంసార్హము. వీరికృషి నిర్విఘ్నముగా జయప్రదముగా ఫలించుగాకయని నమ్ముచున్నాను.

---

శ్రీ శ్రీ శ్రీ రాజా యం. వి. అప్పారావుబహద్దరు ఉయ్యూరు జమీందారుగారును, శ్రీ శ్రీ శ్రీ రాజా శివరామప్రసాద్ బహద్దర్ చల్లపల్లి జమీందారుగారును, శ్రీ శ్రీ శ్రీ శ్రీమన్నారాయణ అప్పారావు బహద్దరు గొల్లపల్లి జమీందారుగారును ఈవిధముగా తెలిపిరి.

మేమున్ను తదితర పెద్దమనుష్యులును కలిసి యీ ఆయుర్వేద పశు చికిత్సాలయ సంస్థను పరిశీలించితిమి. డాక్టరు శ్రీరాములుగారి ప్రయత్న మెంతయు పొగడదగియున్నది. డాక్టరుగారు మిగుల శేముషీ ధురంధరులు. వీరు నిజముగ నీ విషయమునందు జయము పొందుదురని మా యాశయము.

---

యం. నరసింహారావుగారు, కృష్ణాజిల్లాబోర్డు ఎడ్యుకేషనల్ ప్రెసిడెంటు, జిల్లాబోర్డు మెంబరు.

డాక్టరు యేజెళ్ల శ్రీరాములు చౌదరిగారిచే స్థాపింపబడి పోషింపబడుచున్న పశుచికిత్సాలయమును సందర్శించితిని. ఈ సంస్థతరఫున శ్రీరాములుగారిచే ప్రచురింపబడు గ్రంథములు కృషీవలుల కెంతో యుపయుక్తమైయున్నవి. డాక్టరుగారి సహజమగు బుద్ధికుశలతయును, స్వానుభవమును వారిని మిగుల జనసమ్మతునిగా నొనరించినవి. జిల్లా తాలూకా బోర్డుల సహాయమునను జనాదరణమునను వారి పశుచికిత్సాలయ సంస్థ యభివృద్ధిలోనికి రాగలదు.

---

శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారు "అనుభవ పశువైద్య చింతామణి" యను గ్రంథమును రచించి వైద్యవాఙ్మయమునకే కాక ఆంధ్రదేశములోని రయితు సముదాయమున కత్యంతమగు మేలొనగూర్చిరి. కలకాలము ప్రేమపూరితమైన కృతజ్ఞతా పాశములతో రయితువర్గమును కట్టివైచుకొనిరి. అనుభవమువలన సంపాదించిన జ్ఞానమును వారు కొంత కాలముగ వార్తాపత్రికల మూలమునను, ఇంతకుబూర్వమే వెలువడిన కొన్ని గ్రంథముల మూలమునను బ్రచురపరచిరి. పశుచికిత్సయందు వీరి కెంత యభిలాషకలదో, రయితుల కా జ్ఞానమును బోధించుటయను, అంత యుత్సాహము కల దనుటకు ఈ గ్రంథరచనప్రచురణములవలన గల్గిన శాశ్వతోపయోగమే తార్కాణము. గ్రంథముయొక్క ప్రాశస్త్యము, ఉపయోగము పరికించినంతటనే విదితమగును.

అచ్చటచ్చట గ్రామవాసులలో నుండిన పశు చికిత్సకులు పూర్వాచారములవలన గలిగిన మౌఢ్యము చేత స్వకీయానుభవ విజ్ఞానమును లోకమున కుపయుక్తమగురూపమున శాశ్వత మొనర్పక ఆత్మకుటుంబపోషణమే పరమార్థముగా నెంచి, అర్థసంగ్రహణమే విజ్ఞానసంపాదనమునకు పర్యవసానమని తలంచి, తద్విజ్ఞానమును గుప్తపఱచి మరణించుటచే, అనేక చికిత్సకుల యనుభవలాభము భరతఖండమునకు మఱుగైపోయెను. అట్టి యనుభవమును గ్రంథస్థ మొనర్చుటకు వలయు భాషాపరిచయాభావమువలన కొందఱిజ్ఞానము నిరుపయోగమై శైథిల్యమునుబొందెను.

మన దేశమున పశుగణ మెక్కుడుగా గలదు. రయితులసంఖ్యయు చాల గలదు. ఒక చికిత్సకుని స్వయముగ బోషింపగల పశుగణమును పెంచెడి పెద్దరయితు లెవ్వరును గానరారు. ఒకటి రెండెద్దులను గలిగిన రయితుల సంఖ్యయే యెక్కువగా గలదు. అట్టివారు తమ పశువులకు ధర్మ చికిత్స చేయించుకొన గలవారలేగాని ద్రవ్యమొసంగి వైద్యుని పోషణమునకు దోడ్పడువా రరుదు. విపరీతమైన వెలలకు పశువులను కొనుటకు వాడుకపడినట్లు, కొన్నిరూకలిచ్చి వానికి చికిత్స చేయించుకొనుట కింకను రయితులు చక్కగనలవాటు పడలేదు. అదియును గాక ప్రభుత్వమువారిచే నియమింపబడిన "వెటరనరీ" వైద్యుల సంఖ్య మిక్కిలి కొంచెముగా

నుండుటచే వారి వలన నుపయోగము రయితుల కందరికిని అందుబాటులో లేదు. ఉన్నచోటులందును అట్టి వైద్యమునకు ప్రోత్సాహము కలుగకున్నది. "వెటరినరీ" వైద్యము కేవలము హైందవపద్ధతికి విరోధమయినదనియు, అందువలన నిరుపయోగ మయినదనియు ననేకులకు భ్రమ యింకను గలదు.

ఈ పరిస్థితులను చక్కబఱచుటకు గాబోలు ఆంధ్రరయితు లెక్కువగా లాభపడుటకో యన శ్రీరాములు చౌదరిగారిని శ్రీరామచంద్రుఁడీ గ్రంథరచనకు బ్రోత్సాహపరచెను. ఈ గ్రంథము యొక్క యుపయోగము త్వరలో నాంధ్రదేశమునకు ఆంధ్రరయితునకు వ్యక్తపడుననుట నిస్సందేహము. ఇయ్యది ప్రతి రయితువద్ద నుండతగినది. ప్రతి గ్రామపాఠశాల పుస్తక భాండాగారములోనుండి స్థానికసంఘములు రయితుసంఘమునకు దోడ్పడుట యవసరము. ప్రతి గ్రామోద్యోగ కార్యస్థానమునందు చౌదరిగారి గ్రంథముల నుంచి రయితులు కోరినప్పుడు చదువుకొనుట కను వేర్పరచినచో ప్రభుత్వమువారును రయితుల కృతజ్ఞతకు బాత్రు లయ్యెదరు.

ప్రతి ధర్మాయుర్వేద వైద్యశాలకును స్థానికసంఘము లీ గ్రంథములను సరఫరా చేయుట యుచితము. చౌదరిగారిప్రయత్నమునకు ఫలము రయితు లందరకు ఈ గ్రంథము అందుబాటులో నుండుటయే. వారి గ్రంథములను గల గ్రామ గ్రంథాలయములు రయితులకు మఱింత యుపయోగకారులుగ నుండగలవు.

శ్రీయుత శ్రీరాములుచౌదరిగారికి ఆయురారోగ్యములను దైవము ప్రసాదించి యింక నిట్టి యనుభవచికిత్స గ్రంథములను రచించుటకు ధీసంపదలను గల్గించి దీవించుగాత.

మద్రాసు. } బెజవాడ రామచంద్రారెడ్డి, బి. ఏ.,
యక్సు ప్రెసిడెంటు, మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలరు

---

## శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్ జమీందారుగారు, యం. యల్. ఎ., చల్లపల్లిరాజావారు, కృష్ణాజిల్లాబోర్డు ప్రెసిడెంటు.

### పశుసంరక్షణ.

పశుసంతతిని రక్షించుట సాధారణమైన పనిగాదు. పసిబిడ్డలవలెనే నోరులేని పశువులకష్టములనుగూడ వేయికండ్లతో విచారించి కాపాడుకొనవలయును. దానిలో ప్రభుత్వమున కెంతయో బాధ్యతకలదు. ప్రభుత్వమువారుగూడ పశువైద్యాలయములను స్థాపించి రైతులకు సహాయము చేయుచున్నారు. కాని ఆ వైద్యసహాయ్యము చాలక రైతులు పల్లెటూళ్ళలో చేయబడుచున్న రాక్షసవైద్యముతో తృప్తిపడుచున్నారు. ఈ పద్ధతిని మాన్పించి మానవులవలెనే పశువులనుగూడ సక్రమవైద్యమున సంరక్షించుట ప్రభుత్వమునకును, ప్రజలకును ధర్మమై యున్నది.

### శ్రీరాములుచౌదరిగారి కృషి.

ఈ సత్కార్యమునకు శ్రీయుతులు యేలెళ్ల శ్రీరాములు చౌదరిగారు ముందంజ వేయుట మెచ్చుకొనదగియున్నది. పశువైద్యము వంశపరంపరగా వారికి వచ్చినధనము. వ్యక్తిగతముగా చేయుచున్న వైద్యసాహాయ్యమే గాక ప్రత్యేకముగా నీ వైద్యశాలను స్థాపించి తద్వారా వారు కావించిన సేవ అపారము. ఈచికిత్సాలయ ప్రయోజనముల గమనించియే కృష్ణాజిల్లాబోర్డువారు దీనికి కొంతగ్రాంటును మంజూరు చేసియుండిరి. ఈవైద్యాలయము ప్రారంభింపబడినది మొదలు నేటివరకు జరిపిన సేవను పెక్కురు శాస్త్రవేత్తలు, ప్రభుత్వోద్యోగులు మెచ్చుకొనియున్నారు. ఇచట ఆయుర్వేద చికిత్సయేగాక ఆంగ్లేయవైద్యమును, శస్త్రచికిత్సయు గూడ చేయబడుట గమనింపతగియున్నది. అందువలన రైతులందరు నీవైద్యాలయమును శ్రద్ధగా పోషించుకొనవలయును. మరియును ఇట్టి వైద్యాలయములు ఫిర్కాకొకటిచొప్పున, అధమపక్షము

తాలూకా కొక్కటివంతున నైనను స్థాపించుకొని దానివలన తమ పశుగణ మును రక్షించుకొనవలయును.

సాహసము మాత్రము సాహాయ్యముగా ప్రారంభింపబడి నేడొక యమోఘ సంస్థగా తయారయిన యీ ఆయుర్వేద పశుచికిత్సాలయము ప్రజాప్రభుత్వముల ఆదరణమును బడసి ఇంతకంటెను మహత్తరముగా రైతు సేవ చేయగలదని ఆశించుచూ విరమించుచున్నాను.

---

శ్రీ యేజెళ్ళ శ్రీరాములుగారు చేయుచున్న పనిని, వారికశాలను చూచి అమితానందము పొందిని. ఏవైద్యకళాలలోనూ చదువక పెద్దగ్రం ధములను చదువుటకు కావలసినంత సామాన్యవిద్యను పాఠశాలలో చదు వక స్వయంకృషివలన యింతవిద్యను గడించుట సామాన్యమైన పనిగాదు. విద్యను సంపాదించుటయేగాక దానిని మరలపల్లెలలో విశేష విద్యావం తులుగాని యువకులను చేరదీసి తమవలెనే వారినిగూడ తయారుచేయ నెంచుట స్తోత్రార్హమైనపని. అందులోను నోరులేని పశువులకు సేవచేయ నెంచుటకంటె వుత్తమమైన కార్యము మరొకటిలేదని నాయుద్దేశము. వారి జీవితమునుండి వారుచేయుచున్న పనినుండి సామాన్యజనులు గుణ పాఠమును నేర్చుకొనుటయేగాక ప్రభుత్వముగూడ విద్యావిధానమును తయారు చేయుటలోకూడ వీరినుండి నేర్చుకొనవలసినది చాలయున్నదని నొక్కిచెప్పవచ్చును. ఈశ్వరుడు వారికృషికి సర్వవిధముల తోడ్పడుగాక యని కోరెదను.

తల్లాప్రగడ నరసింహాశర్మ,
ఆనంద నికేతనం, చాగల్లు ఆశ్రమము, ప. గోదావరిజిల్లా.

---

శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములుగారిచే నడుపబడుచున్న విద్యాలయమును చూచితిని. వీ రీపాఠశాలను నాల్గు సంవత్సరములనుండి నడుపుచుండిరి. వీరి విద్యార్థులు పలుతావుల వైద్యాలయముల స్థాపించి ప్రశంశనీయముగ పశుచికిత్సలు చేయుచుండిరి. పశుపోషణనుగూర్చి, వుపన్యాసములతో మాత్రం ప్రొద్దుపుచ్చుచు తగినంతగ పశువైద్యసహాయమును ప్రభుత్వమువారు చేయుటలేదను సంగతులు నిర్వివాదమైనది. అట్టి లోటును పూర్తిచేయుటకు శ్రీ చౌదరిగారు ప్రయత్నించుచున్నందుకు నేను వారిని ప్రశంసించుచున్నాను. యీ విద్యాలయమున శిక్షణము చెందిన విద్యార్థులచే వైద్యాలయముల నేర్పాటుచేసి తగిన ప్రోత్సాహమును చేయ ఆంధ్రులను హెచ్చరించుచున్నాను.

గొట్టిపాటి బ్రహ్మయ్య,
ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యదర్శి.

---

శ్రీయుత యేజెళ్ల శ్రీరాములుగారిచే నడుపబడుచుండిన ఆయుర్వేద వెటరినరీ డిస్పెన్సరీని గాంచి ముదంబందితిని. అనేక పశురోగములను కుదుర్చుచు శ్రీరాములుచౌదరిగారు ఖ్యాతివహించి యుండిరి. వీరు పశువులపాలిట దైవమని చెప్పవచ్చును. వీరు పశువ్యాధులను గూర్చియు, వాటినినివారణ మార్గములను గూర్చియు, పత్రికలకు వ్యాసములు వ్రాయుచు, తద్వారా పశుచికిత్సామార్గములను లోకులకు వెల్లడిచేయుచు దేశోపకారులగుచున్నారు. యీ వైద్యము తమలోనే యంతమొందకుండ దేశమున విరివిగ వ్యాపించులాగున పాఠశాల నొకదానిని సాగించుచు విద్యార్థులనుగూడ నీ విద్యయందు తయారుచేయుచు, నీ వైద్యమును నలుదెసల వ్యాపింపజేయు తలంపుగలిగి చక్కని కృషి చేయుచున్నారు. పై నీ వైద్యమును గురించి పెక్కుగ్రంథముల రచించియుండిరి. వీరి యుద్యమములన్నిటికి జయమును గోరుచు, జయమొసంగ భగవంతుని ప్రార్థించుచున్నాను.

కొడాలి శివరామకృష్ణారావు,
ఆంధ్రపత్రిక సహాయ సంపాదకుడు.

---

ఆయుర్వేద పశువైద్య గ్రంధమాల, అంగలూరు (కృష్ణాజిల్లా).

అయ్యా!

ఈ దిగువచూపించు పశువైద్య గ్రంధములన్నియు నూతన విధానముతో ప్రకటింపబడెను. ఆయుర్వేదపశువైద్య కళాశాల విద్యార్థులకును, ప్రయివేటు పరీక్షలకు హాజరగువారికిని, రైతుసోదరులకు, గ్రామములలో నాటువైద్యము చేయుపశువైద్యులకు, అన్ని గ్రామ పంచాయతీలకు, పుస్తక భాండాగారములకు, కో-అపరేటివ్ సొసయిటీలకు, ఆయుర్వేద వైద్యశాలలకు అనుకూలమగునటుల తేలికభాషలో ప్రతివ్రయిమరీ విద్యార్థికి అర్థమగునటుల ప్రకటింపబడెను. ఈ దిగువ గ్రంధములన్నియు ఒకేసారి తెప్పించుకొనువారికి రు 10–0–0 లకే ఈయబడును.

| | | |
|---|---|---|
| 1 | అనుభవ పశువైద్య చింతామణి | 1- 8-0 |
| 2 | ద్రవ్యజ్ఞానము | 0-12-0 |
| 3 | ఆంగ్లేయ పశువైద్య వస్తుగుణదీపిక | 0-12-0 |
| 4 | శస్త్రచికిత్స | 1- 0 0 |
| 5 | అంటువ్యాధులు | 1- 0-0 |
| 6 | నేత్రచికిత్స | 0- 8-0 |
| 7 | ప్రసవతంత్రము | 0-12-0 |
| 8 | వత్సభృత్యము | 0-12-0 |
| 9 | విషతంత్రము | 0- 8-0 |
| 10 | పాడిపరిశ్రమ | 0-12-0 |
| 11 | రాక్షసవైద్యము | 0- 8-0 |
| 12 | పశుజాతులు | 0- 8-0 |
| 13 | పశుగ్రాసము | 0-12-0 |
| 14 | ప్రాచీనపశుసంరక్షణ | 0- 8-0 |
| 15 | పశురోగ విజ్ఞానము | 0- 8-0 |
| 16 | భేషజకల్పము | 0- 8-0 |
| 17 | స్వస్థవృత్తము | 0- 8-0 |
| 18 | పశుచికిత్సాసారము | 0-12-0 |
| 19 | శారీరశాస్త్రము | 0-12-0 |
| 20 | పశుపరీక్ష | 0- 8-0 |

# ఆంధ్రజాతీయ పశువైద్య కళాశాల

(రిజస్టర్డు)

కొద్దికాలములో రికగ్నయిజు అగుటకు సిద్ధముగానున్నది. ఈ సంవత్సరము ఆంధ్రజిల్లాలనుండి 40 మంది విద్యార్థులువచ్చి చదువుచున్నారు. ఇచ్చట తర్ఫీదై వెళ్లినవారికి స్థానికసంస్థలు విరివిగా గ్రాంటులనిచ్చుచున్నవి. కొన్నిజిల్లాబోర్డులు స్టయిపండ్లనిచ్చి మాకళాశాల ట్రియినింగునకు పంపుచున్నారు. ఇంకను ప్రయివేటు పరీక్షలుగలవు. పశువైద్యవిశారద, పశువైద్యప్రవీణ యను పరీక్షలు గలవు. ప్రాథమికోపాధ్యాయులకు, రైతుబిడ్డలకు, నిరుద్యోగులకు మంచిఅవకాశము. విషయములు తెలిసికొనగోరువారు ప్రాస్పెక్టస్‌కు వ్రాయుడు.

కళాశాల ప్రిన్సిపాల్,

అంగలూరు, (కృష్ణాజిల్లా.)





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B121 |
| పుస్తకం పేరు | పశుగ్రాసము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 109 |
| పెద్ద సైజు పేజీలు | NO: |
| ఖాళీ పేజీలు | C |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | narma |
| పేజీలు విడదీసినది | narma |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |